# శ్రీ పదచిత్ర రామాయణము

# కృతికర్తృ నివేదనము

శ్రీ రామాఖ్యుడు మానవేంద్రుడు గుణశ్రీభావ సంభావితుం
డారాధ్యుండగు మాననీయు డిహమోహావేశ సంతప్త సం
సారాబ్ధిన్ గడదాక నీది నిజ సంస్థాచార సారమ్ము ధా
రా రావంబొనరించె, దత్త్వమది శ్రీరామాయణార్థంబిలన్

అంతయంత రామాయణ మంతరాత్మ
గుదురుగా బట్టి వేధించ, గొదరు కోర్కె
గలము చిందులు వేసె - సత్కథకు నోచి,
క్రియగ రమ్యరమ్యాక్షర శ్రేణి కదలె!!!

రససారమ్ములు కొన్ని నేర్చుకొని శ్రీరామాయణంబంత కా
వ్య సుధామంజుల భాషణంబు నిడ బ్రాజ్యంబైన యుద్ఘూర్ణ సా
హసమున్ జేకొని యుంటి, లౌల్యమగు నా యాలోచనంబైన, మా
నస సన్నాహము, నాత్మతృప్తియును సందర్భించె నీ రీతిగన్.

పలుకులు దూకె నిత్తఱిని బ్రాక్తన పుణ్యవశంబునన్, మనం
బలరగ రామగాథ వినయంబున బల్కితి - ధర్మధారణా
విలసిత శీల సంజనిత వృత్తలతాంతము నొక్కదాని బా
సల తొలి ముద్దరాలి పద సన్నిధి నుంచెడు భాగ్యమబ్బగన్

మనమున రామగాథ శ్రుతి మాన్యము జేసితి విన్నయంతనే
మునుకొని కన్నులేమొ తమ మూర్తికి జేరువయయ్యె, గుండె - రా
ముని కడ దిష్టవేసె; శుభముల్ శుభరాగ విచారసారముల్
దనవిగ పట్టునీయు, స్వగతమ్మున ధారకు వారమేర్పడెన్

ఈ మధు మధు మధురధార - రామచరిత
కనుక - నా మనోగతమయ్యె గథలు - బొమ్మ
దవులుకొని మఱియొక బొమ్మ తరుమురీతి;
కొండపై మబ్బులాటాడు కొనిన యట్లు!

నా రసనకందినట్లు, మననము సాగి
పెకలిన గతి, భావాంబర వీధి చూపి
నట్టి దెస - గథాధార పయనము జేసి
విపులమయ్యెను, చిత్రముల్ విస్తరించె

వర్ణచిత్రమ్ము లిచ్ఛితి బరిథి గూర్చి,
యెల్ల లెఱుగుచు భావమ్ము లుల్లసిల్ల
వంపు వాటమ్ము లిడితి బద్యంపు నడక
విజ్ఞతాద్యుతి నిల్పుచు వేడ్కలిడితి

ఇవి పదచిత్రముల్, వరుస యేర్పడె, నన్నిట హృద్యపద్య సు
చ్ఛవి కదలాడె, బద్యముల ఛందపు రూపము భిన్న భిన్న మ
య్యె, విపుల దృశ్యభాగములవెన్నియొ గాథల రూపమె త్తె; నా
కవనము చిత్తశుద్ధి పరికల్పితమైనది తేటమాటలన్.

బాహ్యవర్తన మాంతరాన్వర్థ శీల
చిత్రణాధిక్య గుణముల జెక్కు నెడల
రెండు విధముల బదచిత్ర రేఖ మెఱసె-
నొకటి - కథ; కథనమ్ము వేఱొకటి కాగ!

రామకథ - 'కవి' ది; కథన క్రమము వ్యక్తి
గతము; నిజ మస్మదీయ మా క్రమము; కనుక
దృశ్యముల వెంట దృశ్యముల్ దీటుకొనియె-
సంజెలో పిల్లలాటాడు సరణి జూపి!

ఈ కృతిలో నా రీతిని
నాకృతి దయ నాకళించి, నా పద సౌభా
గ్యాకారణ నందుకొనుడు
సాకల్యాకాంక్ష తోడ, సద్భావమునన్!



జే.యస్.మూర్తి (విహారి)

# శ్రీ పదచిత్ర రామాయణము

## బాలకాండము

కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్
ఆరుహ్యా కవితా శాఖాం వందే వాల్మీకి కోకిలమ్

శ్రీనిడి, మానవాళి సుఖజీవన రేఖకు స్థైర్య కల్పనా
శ్రీనిడి, మంగళాభ్యుదయ శీల పరంపరకున్ సుబోధన
శ్రీనిడి, కర్మ భార భవసిద్ధి విశేష మనీష కక్షర
శ్రీనిడి, సత్య ధర్మ పరిశీలుడు, రాముడు లోక మోముతన్!

కృతియై నాల్కల వాలి వాలి, శుభ సంగీతార్థ గానామృతో
చిత కంఠో క్తుల దేలితేలి. మహదాశీర్వాద వేదోక్తిగా
బ్రతిభామూర్తుల నేలి యేలి, నిలిచెన్ - రామాయణ గ్రంథ కీ
ర్తిత ధర్మాశయ సారకోకిలము - బోధిక్ష్మాజ తేజంబుగన్.

........

కాల చక్రము సతము సంక్రమణ మెనసి
వసుమతి - పునర్వికాసవల్లి నెలసి
నభము - మధ్యందినతరణి సభను నిలిపి
కాలగతి సాగుచున్నంత కాలమిలను;

'కొండలన్నియు నిలకడనుండు వరకు
నదుల నీటి ప్రవాహము నడచు వరకు
రామకథ ప్రచరించును' - బ్రహ్మ వాక్కు;
జగము పదగంగ తరియించు - సత్యవాక్కు!

........

శ్రీరామ భావనా భా
వారామము నామది రఘు వంశ్యుల పరమై
భూమికగా తాపసి తే
జోమయ శక్తి గొలిచె మనుజుని తనుతెలివిన్ 1

కేవల మోనమోల కవికిందగునే యిది? రామగాథ నే
నీ విధి తేటిచూడ సరియే? అది అక్షర రత్నసాను వే
జీవన చేతనానుపద శిక్షయె రేపె మనః ప్రకర్షమున్
బోవదె చీమసైతమొక భూజమునెక్కు ప్రయాస మోర్చుచున్ 2

అని తలపోసి పూనితి మహామహనీయము గావ్యరాశి, నా
మనమున కింపుగా నుడువ, మన్నన గోరి బుధాళినుండి, ఆ
మనుజ వరీయు వర్తన గమమ్ము సమాదర చిత్తవృత్తి నీ
మనుజుల నీతివృత్తముగ మారుట మేలగునన్న నమ్మికన్ 3

ఉత్తమోత్తమ నాయకుం దుద్దవిడిని
కనుల ముంగిట నాకు సాక్షాత్కరించ
కోటి మాటల కోయిలల్ కూసె మదిని
వినుము మున్ముందు మా పాట విను మటంచు! 4

సుజన క్షేమంకరమౌ
నిజమై, మదికిం బ్రశాంతి నిగుడుచు భాషా
రజమై, వేకువ రేకల
స్రజమై తనరె బదచిత్ర రచనా రవమున్ 5

భూమికి, భూమీశులకున్,
భూమి ప్రజకున్ బ్రహర్షభోగము భాగ్యం
బాముకొనెను శాశ్వతమై,
రామాయణ గంగ వరల రమణీయంబై! 6

✶ ✶ ✶

## భూమి - భూజాని

శ్రీసమోపేతము, సకల శ్రీకరమ్ము
కోసలంబెల్ల కలుముల గుప్తి సుమ్ము,
పావనోదార జీవన భవ్య చరిత;
సరయువు మనోజ్ఞ నేపథ్య సరణిగూర్చు! 7

ప్రాంగణంబయి కోసల పరగుచుండ
నాలయంబయ్యె సాకేత మా యవనిని;
విస్తృతము వీడు - త్రిజగతీ విశ్రుతమ్మ
యోధ్య; జనము భూజాని సయ్యొద్ద యనగ ! 8

భూవధూటీ ఫాలభూషిత రత్న చి
త్రమన స్వభావోక్తి తళతళమను,
స్వామి ముందున్న పూజాద్రవ్యముల మధ్య
నారికేళమ్మన నవ్యమగును
రంగవల్లి నడుమ రాణించు గొబ్బెమ్మ
యొరిమ మెచ్చులన నర్థోక్తి తనరు
వేనవేలుగ నిల్చు వృక్షజాలములోని
పూచిన తంగేడు పోల్కి యొప్పు

నొక సమజ్యాంగణము మధ్య నున్నతమగు
వేది వోలె, చౌసాలకు పాదికవలె
జూడ్కికి జలువదనము బంచు నగరమ్ము ;
దివ్వెలకు దివ్వె నగరధీధితి - నిజమ్ము! 9

అటునిటు విభవాతిశయము లమరు కతన
మధ్య నోపలేని సుకము మదువు సేయ
ప్రజల కానంద కాననము జితవడియె,
నమరపురపు దంబును డింపె నయ్యయోధ్య! 10

వితతాయోధ్యకు వేరు వర్ణనలునున్ వేవేల కొండాటముల్
శతథా సామ్యములేల - మా తెలుగు దేశ ప్రఖ్యయౌ ముద్ద బం
తి తెలంగన్ననె చాలు; నింక జనమా- తెల్గుం బ్రజల్ వోలె దా
మతివేలంబగు సౌమనస్య ధనికుల్, హార్దస్వభావోన్నతుల్ 11

ద్విపద
ప్రకట రాజన్య సంరక్షితాభ్యుదయ
సకల మైక్ష్వాకు వంశప్రాప్తి దనరి
చివురు దొడిగి, యెలర్చి, ఫలించి మించి
ఛవినించు శిఖి సదృశము-ధన్య ధాత్రి ! 12

ధైర్యమ్ము, సత్వమ్ము, స్థైర్యమ్ము, శౌర్య
మార్య ప్రవర్తనమ్మధిక విక్రమము,
బాహు శాఖల దాల్చి పాలించు క్షముడు,
సాహసగుణమణి, సాకేత తరణి! 13

రుచితాఖిల సుకృత రశ్మి కేతనుడు
ప్రచుర ప్రచార పర్యాప్త సంధాత
దశరథ సమ్రాట్టు ధర్మానువర్తి
విశదిత ప్రాచుర్య విమలాఢ్య కీర్తి! 14

సప్త సంతానార్థి - స్మరణమ్ము నందు
లుప్త మొక్కటి, ఆరు లోగెనె తేదు!
కలిమిలో తానె సకలుడగు ప్రభువు
కిల మిగిలె కలత, యింతింత వలత! 15

మతిజారి యెద సతమతమొనరించె
సుతకాంక్ష, చెవులలో జోరీగ తిరుగు
దెస 'నపుత్రస్య గతిర్నాస్తి' తిరిగె
నిసి కూడ నిట్టూర్చె నివ్వెఱన్ జిక్కి 16

గురువు వసిష్ఠుడు మతి వరమునులు
జరుపదగిన సేత పురిగొన జేయ
బుత్ర కామేష్టి సంపూర్ణ  పద్దతి ప
విత్ర కర్తవ్యమై, ప్రేరితమ్మయ్యె! 17

ఇచట నులివెచ్చని ప్రసంగమిట్లు వెట్ట
గూర్చి సాగుచుండ, నయోధ్య కూర్మి తలపు
గాలుల పరవశము జెందె, కాల సంధి
జరిగి ఇల గదలె నవ వసంత శోభ! 18

ప్రియసతి కనుసన్నల నిండు ప్రేమభాష
లల్లన మెలమెల్లన నెద నల్లె ననగ
శిశువు నోట – మాటల మధు శీకరములు
వరలినట్లు వాసంతము పలుకరించె! 19

## పుత్రకామేష్టి

ముగిసె నశ్వమేధ మిక బ్రాముఖ్య మెసగ
బుత్ర కామేష్టి కార్యము బూనిరంత
పంక్తిరథు మనోరథము పరుగుదీసి
పుత్రకాంక్షా రథము నెక్కబోయె; నపుడు– 20

వాతావరణము జనులకు
జేతోమోదమ్ము గూర్చె క్షేమంకరమై
ప్రాతర్వేళా శ్రుతి సం
గీతపు మధురానుభూతి కెరలిని భాతిన్ 21

వాతావరణము పండుగ
చేతకు సరియగు విధంబు జేకుర, గాలుల్
వ్రాతల మొదలిడె శాఖా
వ్రాతము పైని, పరమాప్త వచనము లిడగన్ 22

పందిళ్ళను వేసి, చలువ
పందిళ్ళను కట్టి, వాడవాడల కందం
బందించిరి – నగరము నెదొ
చందనమున ముంచి తేల్చి చర్చించినటుల్ 23

తోట లునికిని గోల్పోవ మాటమారె
నరటు లవియెల్ల నగరికి నరయు కతన
పిలక లవియెల్ల వానితో వెడలె, నింక
నాకులకు ముందె నోరూరె పరమాన్న మంద! 24

ఈ ఫలములకు ఫలము లభించె ననుచు
నరటు లారీతి మురియ – గొబ్బరులు సిగలు
పోవగా దలపసిమి గోల్పోయి – యట – మి
గిలె, బుటుక  కొక యర్థమ్ము కలిగెననుచు! 25

ముఖ్య శాలాది నిర్మాణములకు, వసతు
లెల్లెడల గూర్చి సౌకర్య మేర్పరించ –
వేదికల, హోమ కుండాల – వీక్షితమ్ము
జేయ, నిష్టికల్ శతకోటి జేరి వచ్చె! 26

కాల్వల దరిని, సెలయేటి గట్లవెంట
మతి నదీనద పరివాహ మహిని, జవుకు,
మిఱ్ఱు, రేగడి, మాగిలి – పఱ్ఱలందు
నిలువు దోపిడి కలతియై నిలచె – నేల! 27

హసనము, భాషణంబు సుఖమై, శుభమై తమతోడు రాగ, న
భ్యసిత విధేయతాదృతిని వచ్చిరి పౌరులు, శుభ్రకాంక్షలే
ప్రసరము జేయుచున్, దరలివచ్చిరి వెన్కగ స్వస్తి భావుకుల్,
పసలు పసంగ నిర్వహణ బాధ్యత వచ్చిరి ఆప్తచిత్తులున్ 28

అన్యోన్యంబగు  భావబంధమది, హర్షామోద వర్షార్ద్ర ప
ర్జన్యాధీర సదృశ్యమై నిలిచె నా క్ష్మానాథ, సామాజికా
ధీన్యాసక్తి; తదర్థమైన సకలోద్దేశంబు లుద్యోగముల్
జన్యాదేయములయ్యె, నయ్యె బ్రజకున్ సంతోష కర్తవ్యముల్ 29

ఇది మనపాలి భాగ్యమని ఈద్యమునైన సమస్తమున్ బదిం
పదిగ విశేష దృక్కులను పారువపట్టెడువారు, వేడ్కమై
పదముల నాచితూచి యిరుప్రక్కల స్రుక్కెడలించి ఇష్టిలో
పదక మెఱుంగ గోరి నిలువారును, నట్టిటు నిల్చుచుండగన్ 30

అంతట నిండిన దొక హే
మంతపు చల్లదనమొ, పరిమళమొ- తెలియ దా
వింత యనుభూతి భారము
సంతస మది రాజధాని - సంధించెననన్! 31

వెన్నెల దడిసీ తడియని
కన్నె విరుల జలజలమని గాలి చెలియ - తా
నన్నున దోసిట  రాల్చిన
చెన్నున భావించిరి ప్రజ - సేమము పొదలన్ 32

రచ్చలకెక్కె ముచ్చటలు, రాణ చిగిర్చెను రథ్యలన్నిటన్
హెచ్చులు తగ్గులున్ మఱచి యెచ్చరికల్ పరిలుప్తమయ్యె - సం
పచ్చయ మద్దకమ్ము సలుపన్  గ్రతువాటిక వెల్గులీనె, న
భ్య చ్చలితంబు నయ్యె బరిపూర్ణ ఫలోదయ మాననమ్ములన్! 33

అదియె యజ్ఞభూమి-యజ్ఞియ సంభార
భారమయ్యె; గుణవిభావమయ్యె
పైన లోనగూడ ప్రాజ్యమాహ్లాదమ్ము
తలరు నొక్క తమ్మి కొలను వోలె! 34

వేత్త లొకవైపు, మఱి తత్త్వవేత్త లొకట,
దరిని ఋత్విక్కులుండ, సిద్ధాంతులచట;
నిదియె గాత్ర్యతాధికృత సమీక్షకులకు
నొక్క ప్రత్యేక కక్ష్యగా జక్కనయ్యె! 35

అంతఃపుర వాసులకొక
చెంతను ప్రత్యేక కక్ష్య; సిరులరుదేఱెన్
బొంతకు నన్న విధము - పూ
బంతులు విరిసిరట ముద్దబంతులు వోలెన్! 36

రాణులున్నారు; ఉన్నారు ప్రణయినులును
వినయవతులుండి, రుండిరి విజ్ఞవరులు
కలదు దాసదాసీ జనగణము, కలవు
తరలి వచ్చిన యందంపు తరగలచట! 37

శివశిఖరమైన ఆ ఋష్యశృంగ తపసి
యుక్త వేదోక్త విధుల  ప్రయోక్త యయ్యె
తనదు కనుసన్నలే యజ్ఞ ధర్మములుగ
నట బ్రధాన ఋత్విక్కుగా నవధరించె. 38

చీని చీనాంబరమ్ముల చెఱగులెల్ల
తనదు నాలుగు చెఱగుల దడిమి - వన్నె
చిన్నె లలదుకొన్న కతన - జెమ్మరించె
ధరణి, తనకు దా నూకొనె ధత్రమపుడు! 39

కాశ్యపాది వాచంయమి గణము మఱియు
మంత్రి  దండనాథ హిత సామంతరాజ,
వర పురోహిత పరివార  సరసి యంత
నుత్సుకత లోన గడలెత్త నుత్సహించె! 40

ఈ కొలని గట్టు నంటిన వీక విసర
మయ్యె - మాన్య సామాన్య కల్హార సరసి-
నాగరక, జానపద, జననాధు వంతు
లెల్ల కూడ, పుర పురంధ్రు లెల్ల జేర! 41

శిష్టు లందఱు వినయ విశిష్టు లయిరి
'బ్రహ్మ' ఋష్య శృంగుని ముందు, బ్రహ్మ యజ్ఞ
పఠన దీక్షా క్రియన్ బూని భక్తి నొక్క
'బ్రహ్మ' కంజలించిరి నవ బ్రహ్మలందు! 42

సంబరముల మధ్యన్ శ్ర
ద్ధాంబుద ఛత్రము విరియగ నారంభము హే
రంబుని పూజను సర్వ శు
భంబులకై జేసి రిష్టి వర యుద్గాతల్ 43

దశరథ చక్రవర్తి క్రతుధర్మ విధానము నెంచి, శ్రద్ధకున్
వశమయి, యాగదీక్ష కనువౌ విధి భక్తిని - భక్త్యవధానమెల్ల హృ
ద్విశదముగా నిజాంజలికి వెచ్చదనమ్మిడ గూరుచుండె -గో
టి శుభ వికత్థనమ్ముల పఠించుచు నాదృతి మోదసాంద్రుడై 44

తరుణుల్ కోసల రాజ పుత్రియు, సుమిత్రా రాజ్ఞి, కైకేయియున్;
వరసిద్ధ్యర్థము కూరుచుండిరి సుహృత్పద్మద్యుతుల్ భావ భా
స్వర సాహస్రిగ బ్రాంగణమ్మునకు శుంభత్కాంతి సంతర్పణల్
జరుపన్, బుత్రత గాంచనైన హితకృత్సంరంభ సంపూర్తికై! 45

పొలతి సాధ్వి కౌసల్య తా బూజనీయ,
మగధరాజ సుత సుమిత్ర మాననీయ,
క్లిష్టసహచరి కైకేయి - కీర్తనీయ,
దశరథునికి గూర్చు మహిషీ త్రయమువారు! 46

కైమోడ్పుల్ సుతకాంక్ష నివ్వటిలగా కాకుత్స్థ వంశమ్ముకున్
నామాభిఖ్య సమన్వయమ్మునిడి, సన్మానమ్ములన్ గూర్చి, స
త్ప్రామాణ్యమ్మొనగూర్చ, గూర్చొనిరి - సామ్రాజ్ఞీమణుల్ నమ్రతా
సామంజస్యము నెమ్మిసేయ, త్రిగుణాశాసమ్ములే వారనన్ 47

వీరి ప్రక్కగ నిల్చిన వనిత - శాంత
పచ్చని మొగమ్ము హాసనసంపచ్చయమ్ము
బంచ, గౌరవాస్పదరూప భాస మగుచు
ప్రాంగణపు శోభకొక సొంపు వరలజేసె! 48

శాంత గాంభీర్య సుస్వభావాంత శాంత,
అంతరార్ధ నితాంత ప్రశాంత శాంత,
క్షాంత సద్గుణాక్రాంత విశ్రాంత శాంత,
ఆత్మగౌరవోదీర్ణ విక్రాంత శాంత! 49

ఆమెకు జక్కనైన మరియాదలు మన్నన లాదరమ్ములున్
గోములు లేమి రాణులును గోముగ నిత్తు రయోధ్యకే
నోముల పట్టియంచు మది నూల్కొను రీతిని, పెట్టు పోతలన్
బ్రేమము బంచియిచ్చెదరు పెంపగు గారవ మాడు బిడ్డకున్! 50

మధ్య మధ్య నంతఃపుర మహిళ లంటి
తిరుగ, గనుసన్నలన్ బరాబరులు సేసి,
మందహాసముల సఖుల మందలించు
శాంత హవణింపు నెలవున గాంతి నింపె! 51

ఆజ్ఞ లనుమోదములెల్ల యజ్ఞమందు
సాగె-శుభసమాపన్నతర్పణము కడకు,
విమల సన్నివేశ మభినివేశమయ్యె
నిర్మల ప్రకృతికి, గమనీయ ధృతికి! 52

మంగళా హసన ముపాహితాంగ మయ్యె
నా ప్రకోష్టమునకు, నిష్టి - అష్టమూర్తి
దిష్టమయ్యె నన్న పరమాదృష్ట మందె;
వేద మంత్రాల ఘోష ప్రవృద్ధ మయ్యె! 53

భూకాంతుందును రాణులిష్టి సకలంబున్ బూర్తియౌవేళ నా
నాకాధీశు మరొక్కమారు ఫలసన్నాహంబు నందించగా
సాకల్యాస్థను వేడి, వేత్తలను దీక్షా సత్వ మేపార సు
శ్లోక ప్రాప్తిని గూర్చ గోరుకొని రా సూత్రాంశ మోహో యనన్ 54

మనసులు తెలిమబ్బు గనియలై తేలగ
గరములు మొగుడుచు కలువలయ్యె
నెదల నుచ్ఛ్వాసమ్ము లేడాటలాడించ
గన్నులరవిడి సంపన్నమయ్యె
ప్రతిభాసనమ్ము భావ్య ఫలముపై వ్రాల
శ్రవణములు శుభ పత్రమ్ములయ్యె
త్రిగుణముల్ నిర్వ్యాజ తేజస్సు నందీయ
బాదమ్ము లావేగ పదములయ్యె
తనువు లంతఃకరణములు తహతహపడె
నిలిచి నిలువని వారుగా నిలువు గొలువు
కొఱకు నిల్వరించుకొనిరి - కుతల పతియు
రాజ పత్నులు; జనులు - సంభ్రమము జెంద! 55

వజ్రపుం దునియల వలె బ్రజలు ప్రాంగ
ణమ్ము నిండి నిల్వ, బ్రముఖు లమ్మఖాగ్ని
హోత్ర చుంబకమ్మంటిరి; హోత - శేష
ఫలము గోరి పూర్ణాహుతి వడిని వ్రేల్చె! 56



క్షేమమిడ ననలుడు ప్రదక్షిణ శిఖలకు స
మగ్రత నొసగి చెలరేగి - మహిమ మొసగ
నిష్టివేదియు నిజ శుభాభీష్ట సిద్ధి
వహ్నినోర్చె, నేర్చె దిశల, బ్రభలదేర్చె! 57

## పాయస ప్రదానము

వారును వీరు వారు సరివారలు నెల్లరు వారి భావ సం
చారము నందు లీనమయి చల్లగ మెల్లగ జూచు చుండగా
భూరి కళల్ - నిజాంచిత విభుత్వ మహత్వజాల మం
దీరిక లెత్త లేచె - ఘను డేలిక కోరిక తీర్చి కూర్చగన్! 58

మధురాక్కర
గాలి వీచుచు మైత్ర్యుక్తి గాన్క లర్పించు చుండ
నేల నిక్కుచు మేల్పల్కు నెత్తావి బంచుచుండ
వేలుపుతెరువు సుకసుద్ది వెలది వెల్గించుచుండ
లీల-గన్నుల జిఱునవ్వు లిపి తులకించుచుండ. 59

కోటి కోటిగ కుంకుమ కుప్ప లెగసి
యొక్క చోటికి జేరి యచ్చొత్తినట్లు,
నవనవోక్త రుచిర కవనంపు రాగ
మట్లు, రక్తాస్యతేజ పర్యాప్త మెలయ; 60

సర్వ సర్వాంగ సౌష్ఠవ సంపదాప్తి
తన తనూ విపులత్వ మొదవి, సమృద్ధి
దనుప; నుత్తమత్వము నున్నతత్వ మందు
మిశ్రితము కాగ, జొక్కంపు మేల్మి నిగుడ; 61

లక్ష్యలక్షణయుత సమలంకృతుండు
రక్షణోద్యోగ భార సంరక్షకుండు
బ్రకట కృతకృత్య తార్థ తాత్పర్య శిక్ష
ణానుభవి, యొక్క భాగ్య ధనదుడు నిల్చె! 62

హితుడు లోక కళ్యాణార్థహేతి, గరము
దాల్చె – దివ్య మమోఘము దర్శనీయ
మైన యొక కలశమ్ము; జనాస్థ హెచ్చె
నలుగడల – హర్షనిశ్వసనంబు వెడలె! 63

దివ్య మమేయమైన వరదీప్తుని నాహవమూర్తి గాంచి, సం
భావ్యము సిద్ధమైన శుభభావన లందున జిక్కి రెల్ల మం
తవ్య బుధాళి, భూధవుడు; తక్కిన వా రనిమేషులై రెదో
నవ్యము భవ్యమైన కలనన్ మలిరేకలు విచ్చుచుండగన్ 64

రక్తి – మూర్తీభవత్ప్రభారాశి గాంచు
దశరథక్షితినాథుడు తన మనసున,
నెదియొ ప్రస్పదనము, నాత్మనెదియొ కుదురు,
పాదు – నిలిచినటు లపూర్వ భావమందె! 65

ఓజోఘనుడున్, వీర్యుడు
బ్రాజాపత్య పురుషుండు – వర పరమాన్న
భ్రాజిత పాత్ర నొసంగెను
రాజుకు; దత్సుభముహూర్త రంజన మొలయన్ 66

జ్ఞానానందంబును, శ్ర
ద్ధానందమ్ము మరి భక్తి తత్వమ్మెదియో
మానస సీమకు సేమపు
బూనిక నెఱిగించ విభుని పొంతన ముబ్బెన్ 67

విభు యశః పటహ కృత గంభీర గర్జ
గా– కృపాఝరీ ధ్వని గుల్కు కంఠ ముత్స
హించ యజ్ఞ పురుషుడు వచించె నిట్లు;
నృపుమనోరథ సంపూర్తి నిశ్చయించి; 68

క్ష్మానాథ! మీదు పుణ్యం
బే నేనుగ వచ్చినాడ, నీ యిష్టి ఫలం
బానేయము – సంప్రియ సం
ధానితసురసభకు; కొనుము ధర్మధ్రువమున్! 69

సుకృత పరిపాక మదియే
ప్రకటిత పరమాన్నమయ్యె పరమార్థంబే
సకలము నొనగూర్చును; తి
గ్మకుర కులాభ్యుదయ మొనరగ శుభములొనర్చున్ 70

అనిదంపూర్వము యిష్టి, యిష్టి ఫలమీ యన్నంబు, యన్నంబు మీ
కను సంధించును దేవ బాంధవము, మాన్యప్రాభృత ప్రాప్తియున్,
వినుమోయీ– కలితానురాగమున దేవేరీత్రయం బియ్యకో
లున స్వీకారము జేయ, నిమ్మదియె త్రైలోక్యానుకూలంబగున్ 71

ప్రామాణ్యంబగు సత్యమన్నము, పరబ్రహ్మస్వరూపంబు, త
త్ప్రాముఖ్య ప్రతిబింబితమ్ము, మహిమావాలమ్ము నౌ భోజ్య మో
భూమీశా – పరమాన్నమియ్యది, మహాపూర్ణమ్ము పాత్రమ్ము, నీ
యామోదమ్మును గొమ్ము, కొమ్ము పరమాభ్యాస ప్రసాదమ్మునున్ 72

అని ధీరంబుగ బల్కి, రాజు కరమం దా పాత్రమున్ జేర్చి తా
వినతుండౌచు వసిష్ఠుడాది మునులన్, వేదాంతులన్, వేథలన్
గని, సౌముఖ్యమునంది, పార్థివునకున్ గైకోలు నందించుచున్
జనె, నిర్ణీత విధాన ధుర్యుడగు ప్రాజాపత్యరూపుండొగిన్ 73

అట 'నభీష్టార్థ సిద్ధిర, స్తనెడు స్వస్తి;
యనుమత 'తథాస్తు', 'అస్తు' 'తథాస్తు' శతము,
కలకలల పల్కు పువు విసరుల నవఘుళ
మునెగసి, యెగసె – సర్వతోముఖము జేర!  74

ధర్మశ్రద్ధాభక్తులు
పేర్మిని హృది నాక్రమించ -స్వీకర్తగ - ష
ట్కర్మల రెంటి నొనర్చెను
ధర్మపరుండా దశరథ ధరణీధవుడున్! 75

కరములందున్న పాయస కలశమందు
సకల విశ్వ మది యొకట సందడించి,
చేరి యొకచోట; స్థితి సమకూర, ముద్ద
గట్టి, ప్రోవుగా, రాశిగా - గడిమినిండె! 76

భావనలు సాగె నిట్టు లవ్యక్త సరణి
నొక్క బాధ్యతయు బరువు నొక్కటకట
విభుని హృదిని, మానసము నుద్విగ్న పఱచె,
దీర్ఘదర్శికి విత్తు - గతిపడిన గతి! 77

మెల్లగ గమ్మతెమ్మెరలు మేనును దాకిన రీతి దోచె; ను
త్పుల్ల జలేజ గుచ్ఛములు దోసిట నింపుచు, జాజిపూల బై
జల్లిన భాతిదోచె, హృది చల్లదనమ్మునకమ్మకమ్మయెన్,
ఘల్లనె శోభనావహపు ఘంటలు రాణుల మానసంబులన్ 78

భావ సమాహారమ్మెదొ
యే వివర మెఱుగని యూహ లేలగ రాణుల్
భావి ప్రభావ భావన
లావిష్కృతి జేసిరి - నతులై, సన్మతులై! 79

డెందము లుప్పొంగగ దా
మందఱి రసనలకు శుభము లందించుచు నా
నందించుట యెఱిగి ప్రజయు
దొందఱల గొలువు సుడిసిరి, దొరకొను నాశన్! 80

ఆ సమయమ్మునన్ దశరథాధిపు భావ మెఱింగినట్లుగా
న్యాసము జూపి సభ్యజన మా నృపు చర్యకు సిద్ధమైరి, రా
జా సకలోత్తమంబును, యథార్థము నౌ పరమాన్న మంత వే
యాసల క్రొత్త కాన్కగ గుణాఢ్యలు భార్యల కీయసాగుచున్ 81

ముందఱకేగి నిల్చె, ముని ముఖ్యుని కన్జికిలింపు దీవెనల్
వందలువేలు గైకొని, యపార సువత్సలతా స్వభావమున్
బొందుచు నాశ్రవుండయి, ప్రపూజిత సంయమి ఋశ్యశృంగుకున్
వందన మాచరించి గుణభాస్వరలైన సఖీత్రయిన్ గనెన్ 82

సౌమనస హసనమ్ము విషయ విశేష
సంచికాపుట దెరువ - భూజాని వచ్చె-
కలిత సౌశీల్య కౌసల్య కడకు, వచ్చి
కనుల గనులుంచి గాంచె సంకల్పదళము! 83

సానందయయిన కౌస
ల్యా నయన జలేజ కర్ణికాంతర ప్రేమా
నూన రజారుణిమంబున
భాను కులాభ్యుదయ శివము భాషితమయ్యెన్ 84

కోసల రాజపుత్రి తన కోర్కెల కాకృతి గూర్చ సిద్ధమై
ఆసల సాకమున్ గనుల యంచుల నిల్పుకొనెన్ బ్రదాత - వి
శ్వాసిని, ధర్మశీల, గుణశాలను గాంచి, వికాసమొంది, సం
తోసపు గుత్తి గుత్తగొను దోసిలి బాగెము బంచ బూనుచున్ 85

వచ్చితి వీవు ప్రేమ రసవాహిని వచ్చిన రీతి నీ కడన్
దెచ్చితి వీవు జీవన విధేయత; రాగవిభాగ రక్తియున్
నచ్చెడు రీతి నిచ్చితి వనాదృశ తత్త్వగుణత్రయంబు; నే
మిచ్చిన దీరనట్టి సుఖమిమ్మిక నచ్చపు కీరితిన్ సఖీ! 86

నిక్కపుటాలు వై నిలిచి, నిష్కుటమున్ వెలిగించి నా హృదిన్;
బెక్కువ ముగ్గుబెట్టి మది; ప్రేక్షణ వీణను శాంతిగీతికల్
మిక్కిలిమీఱ బాడి గృహమేదిని వైతివి, ధర్మచారిణీ
దృక్కలనన్ ననున్ మహిత దీక్షితు జేయగ రమ్ము స్వామినీ! 87

ఏ సుముహూర్తముం దలచి యింతలు నంతలుగా నెడందలో
నాసల పూసలేరుకొని హర్షపు సూత్రము నందు గూర్చి నా
వో సతి! భవ్య హేతువుల నూహల మాలల దీర్చి కూర్చితో;
ఆ సమయమ్మిదే నెరపు నందెను; యందుము నర్థసిద్ధినిన్ 88

ప్రేమోద్విగ్నత నిండి పొంగు పలుకుల్ బేర్కొంచు ధాత్రీశ్వరుం
డామోదమ్మును బంచె దేవికి, సుఖవ్యాహార సంయుక్త వా
చామర్యాదకు సంతసించి శుభరక్షాకాంక్షతో నన్నమున్
దా మేల్మేలుగ స్వీకరించ సతి సిద్ధంబయ్యె నుద్వేగియై 89

పరమాప్యాయితుడైన భూమిధవు డా భార్యామణిన్ డాసి, త
త్పరమాన్నంబున నర్థభాగమును సంభావ్యంబునౌ సత్యమే
పరమౌదార్య వరమ్ముగా గలుపుచున్, బాష్పోద్గతిన్ మ్రింగి, భా
స్కర భావాంతము గుండెనింపు కొనుచున్ కౌసల్య కందించగన్ 90

విశ్వాతీత మహత్వమొ
విశ్వస్తుత్య శుభసత్య విస్ఫురణంబో
శశ్వత్తేజో నిధియో
శాశ్వత సుఖమొ కరముల సంధిలెననగన్ 91

ధర్మమున కొక్కరూపకోత్సవము కలిగె,
శస్తమెగసె, సకలకళా శారమొప్పె;
నయము, నయనమ్ము జరిగె, శ్రీజయము విరిసె;
తనువు సుకగాలి తెరల తత్తరము వడియె! 92

ఒక భావాంకుర మేర్పుచు
బ్రకటిత మగుచున్ దలిర్చి భాసుర మయ్యెన్,
సుకలాన్విత కౌసల్యకు
నొక వెలుగు విసుగు యెదంద నూయలలూపన్ 93

అవ్యక్తానందముతో
భవ్య మనస్విని - ప్రపూత - పాయసము గొనెన్
నవ్య స్తోమంబనుచు న
భివ్యక్తాంచిత సు"ధర్మ" విభవం బనుచున్ 94

పాయస భాగము ధర్మ వి
ధేయత తనరంగ, భక్తి తెరలగ, నమృత
ప్రాయముగా - నాయమ - కను
దోయికి నద్దుక - భుజించె - దులకించు మదిన్ 95

కౌసల్యాసతి ప్రక్కగ
నా సుగుణఖనిని సుమిత్ర నరసిన రాజ
భ్యాసము జని మధుర ఫణితి
భాసిలు పులకల పలుకుల భాషించెనిటుల్ 96

వినయ వివేకసంపదలు, వేగొనముల్ సహవర్తులౌచు, ని
న్ననయముగావ, హర్షకలనాంచితు జేయుచు, ప్రేమమూర్తివై
పెనకువ, భక్తి, గౌరవము, వీక, విలాస, సునీతి, రాగముల్
ననిచిన యింద్రచాపముగ నన్నలరించు సుమిత్ర! నెచ్చెలీ! 97

దైవిక, రాచకార్యముల దల్లడమందెదు నాకు నీవెగా
మానిని యక్షవృక్షము, సమాస సమానవు, సాంత్వనాకృతిన్,
మానిత సౌహృదంబె యసమాన ప్రవృత్తిగ నన్ను నిచ్చలున్
మానన జేయ శాంతము, సుమాళము గ్రోలిన 'శ్రీ' ప్రభాకృతీ! 98

స్వీయసౌఖ్యమ్ము కన్న జీవితము నం దు
దాత్త లక్ష్య  నిక్షేప బాధ్యతలె యెపుడు
నీదు విశ్వాసమై - హృది పాదు కొనియె;
స్వస్తి - నీదు భావస్థిరత్వమ్ము, తరుణి! 99

మేలి తలంపుల - శోభన
లీలాయిత సౌఖ్యదాయి, లేఖితసౌజ
న్యాలేఖ్యస్ఫుట రేఖా!
పాలున్‌గొను మస్మదీయ భాగ్యము పండన్ 100

అని ప్రియమార బల్కెడు ధరాధిపుగాంచి - సుమిత్ర - సంతసం
బనుమితి తొందరించ, ధవు నానన రేఖల హర్ష సూచితా
ఘనతకు మౌనరాగ లిపికల్పనచే సుహితమ్ము గూర్చి, భూ
పుని కనుముందు నిల్చె, దన పున్నెము పండు వేళ డాయగన్. 101

స్థితముగా, నిశ్చితమ్ముగ, స్థిరము, నెనరు
దనర, ధీరగంభీరయై, ధిషణమెఱయ
నిలిచియుండె సుమిత్ర, మనిత సుశీల;
అణకువకు, సహనమ్మున కాటపట్టు! 102

భాషితము నభాషిత సం
భాషణ మెఱిగిన నృపుండు పరమాన్నమునన్
శేషాంశమునం దర్ధము
శేష విభవ కాంక్ష, మహితశీలకు నిచ్చెన్. 103

'శ్రద్ధ'నే మనీషావతి శ్రద్ధ గొనెను
ప్రథిత తేజః ప్రసాద భద్రమును జేసి
సంభజిష్య విశేష భాజనము గొనియె;
కథన మీపయిన స'శేష' కల్పనమ్ము! 104

'శ్రద్ధ' స్వీకరణమది, స
మృద్ధము - ధర్మానుగతి, యమిత సమ్మతియున్
శ్రద్ధయె, యనుగర్జితము, వి
శుద్ధ, మనుఖ్యాతి - ధర్మశోచిస్సునకున్! 105

కదలిన ధారుణీశుడిక కైక ముఖాముఖి యౌచు నిల్చె, నా
ముదితయు, రూపకోచితము, ముఖ్యము దివ్యకృతమ్ము నైన స
మ్మదకృతి  భూమికం బలె, బ్రమాణ సుచిత్ర విలాస సౌష్ఠవా
భ్యుదిత విశారదమ్ము వలె పూచెను, తోచెను కీర్తిరూపగన్. 106

తనదు జీవనాడికి - పట్టు, ద్రవ్యమోక్ష
దాయిని; తన ప్రేమల పేరు - తరుణి కైక
మనసున మనసు కలిపి తాననెను - రాజు-
స్నేహ మోహన భాషణశ్రీ చెలంగ! 107

నీవె మహోత్సవమ్ముగను, నిర్ణయకర్త్రిగ, ప్రాజ్ఞమూర్తిగన్
జీవన తోరణమ్ముగను, చే దివియం బలె, ప్రాణధుర్యవై
నావు కళావిలాసిని! ఘనంబగు నట్టి స్వతంత్రతా మహ
ద్భావివి, నీదు హేల నను స్వస్థత దేల్చు సఖీశిరోమణీ! 108

శృంగారైక నివాసము
మాంగల్యాభిజన భాసమాన నివాసం
బంగీకృత కేళీ వే
శ్మాంగము నీ ప్రాపు కైక! శబ్దశలాకా! 109

రమ్మా, పరమాన్నంబును
గొమ్మా, పుత్రవతివై, విగుణ, విగమపు సా
రమ్మిమ్మా! కైకా! నీ
ముమ్మరపు టెలమి, సొలపును, మురిపెము నిమ్మా! 110

పరమారాధన భావతత్త్వమున, సంభావ్యైక, సాఫల్య, సం
కర రూపస్థితి జేర్చి కూర్చి, తమ భాగ్యాధిక్య సాకల్యమున్
బరమాన్నంబున గల్పి పాత్రమున నిల్పి యున్న భాగంబులో
అరపాలున్, సతికైక కిచ్చె, నరపాలాధీశుడా వెంబడిన్. 111

దశరథరాజు ప్రేమభరితమ్మగు నీవిధి చేతకు గోముకున్
వశమయి కైక, భక్తి పరిపాకపు భావము లుప్పతిల్లగన్
భృశము – 'భర'మ్మునే తలపుపంటల నింపుచు నందె 'నా
కు శుభ ముపార్జనమ్ము సమకూరునుగాక' యటన్న వాంఛతోన్. 112

భక్తి ధర్మానుతప్తము, భక్తియగును –
ధర్మమున కనుకర్షము, ధర్మమున క
ను క్రమము భక్తి, భక్తియె నుతము – ధర్మ
మున – కనుత్సేకము, నవియె – మొగ్గ, తొడిమ! 113

తనదు కేలును కైక కేల్కొన – మృదుత్వ
మొదవ, గీల్గొన జేయుచు గదలె – రాజు,
వామ హస్తమున కలశి – పాయసమ్ము
గాంచి, కాంచె – సతీత్రయి, గలల శతము! 114

అడుగును ముందు వెన్కలకు నట్టిటు వేయుచు నున్న ధారుణీ
శుడు – కలశమ్ము లోన గనె – శోభిత పాయస భాగమింక యం
దడుగున నుంట గాంచి, పరమాదరణీయమునౌ తలంపులే
ర్పడ, నొక ప్రక్కగా నడచె, భార్యల మువ్వుర గ్రుచ్చి చూచుచున్. 115

పెద్దతికమ్ము నిచ్చి తన పేరిమి పట్టపురాణిపైన చూ
పద్దెను – రాజు, కేకయ కులాంబుజ శోభన భాగ్య లీలకున్
బద్దెపు టీకు గూర్చె, నటుపైన – సుమిత్రను జూచె, నంతలో
నొద్దియ కూర్మి బాయసము నొప్పుగ కైకకె యీయ సాగుచున్. 116

ఒక యడుగును ముందుకు మరి
యొక యడుగును వెన్కవేయు నొక ద్వైధమునం
దొకట వికల్పనము నం–దే
లిక జిక్కెను, కడకు 'శక్తి' లేఖ్యంబగుతన్ 117

నమ్రతా వీణియ – సుమిత్ర – నయవిశాల
దటికి జేరి 'శ్రద్ధ' కనునాదమును కాంక్ష
జేసె, నామె ప్రక్కన శాంత చెలువమమర
నిలిచి యుండె – సందర్భపు గలిమి పండ! 118

శాంతము, నిస్తుల నైర్మ
ల్యాంతఃకరణమ్మిరువురి నాత్యంతిక సు
స్వాంతల, నైక్యాత్మల – స
త్కాంతల నొనరించగ ననుఘటనము పొసగెన్ 119

గుమ్మడి పూవుల రాసిని
తమ్మింబలె శాంత, మరియు దళ పుష్పముగా
నమ్మగధాధీశు సుతయు
నిమ్మగు ముచ్చటల నించ, నేలిక కదలెన్. 120

శాంతయు, నామె నెచ్చెలిగ, సౌహృదలక్ష్మిగ, నాత్మమిత్రగా
పొంతను జెంతనున్ మసలు బుద్దుల పొత్తు – సుమిత్ర – భావి వృ
త్తాంత పదంబులో నొదుగు పల్లవియు న్ననుపల్లవిం బలెన్
సంతతమున్ దలంచు మనుజాధిపు దూర్జిత సౌమనస్వియై 121

'జంట' యను మాట రసనపై సంచరించి,
పెదవి కదలి, వాగనురూప విస్ఫురణము
గాగ, దశరథ క్షితిజాని – గౌరవమ్ము,
నభిమతియు సుమిత్రాసతి ననుసరింప; 122

క్షణములకు ముందు తానుగా కైక కీయ
వలయు నేమొ యనుకొనిన పాయసమ్ము
నిక సుమిత్రకే యందీయ నిచ్ఛగించె,
నిర్ణయించె - మది; శక్తికి నెలవు గొలుప! 123

ఆమె ముందుకు వచ్చి సమాదరమ్ము
నాదరించి, చూపు గలిపె - హర్ష మొదవె
పలుకరించె, శుభంకర భావమందు
తీర్థమాడిన కోర్కెలు తివురుకొనియె; 124

పాయస భాగము నంత ద్వి
తీయ కళత్రమున కీయ దృఢమగు కోర్కెన్
శ్రేయపు దలపుల నామె - వి
ధేయత- నగ్గలపుశక్తి - తీరున నందెన్. 125

భక్తికి గలిసె- మహనీయశక్తి; శక్తి
యందు - నిచ్ఛాది శక్తి, సత్త్వాది శక్తి
మఱియు నుత్సాహ, ప్రభుత్వ, మంత్రశక్తి-
సకలము మిళితమై నిల్చె, 'శక్తి' వెలిగె! 126

ఒక కవచమొనగూడె భక్తి కిపుడింక;
అది - మహితశక్తి; ధర్మంబు ననుగమించు
శ్రద్ధ; ధర్మంబునకు ప్రకర్షణము భక్తి;
భక్తియును శక్తి - ధర్మసంప్రశ్రయములె!!! 127

మురిసిరి రాజు, రాణులును ముచ్చురు, నంబర రత్న వంశ్యులున్,
మురిసెను రాజధాని, మునిముఖ్యులు, సైన్యులు, దండనాథులున్
మురిసిరి, తన్మహోత్సవము ముచ్చటలెల్లను దృష్టిజూడగన్
వరసుత యాగమా పయిని పాయసకార్యము పూర్తియౌ తఱిన్ 128

ఈ సాఫల్యము గన్నులార గని దేవేంద్రాదులున్, బ్రహ్మ, కై
లాసాధీశు డభీష్ట సిద్ధి కలుగన్, లక్ష్యార్థమై దీవనల్
రాసుల్పోసి ప్రతుష్టులైరి - ఘన మార్తాండాన్వవాయ ప్రభూ
తాసాధ్య శ్రవణంబు గూర్చ, నొనరన్ ద్రైలోక్య సంరక్షణల్ 129

## శ్రీరామచతుష్క జననము

రసభావంబులు నిండగా సతులకున్ బ్రారంభముత్సేకముల్
విసరంబయ్యెను; గర్భచిహ్నములు దీప్తింజెందె; నా పిమ్మటన్
బ్రసవంబయ్యెను; పుత్రసంతతిగ శ్రీరామాదు లావిర్భవిం
చ, సమాసార్థపు సిద్ధిగల్గె, శుభహర్షంబెల్ల బెల్లూరగన్ 130

హర్షము పొంగి సంప్రియపు హంసల దీవికి జేరె, తండ్రి కు
త్కర్ష విభూతి నందిరట దల్లులు ముచ్చురు, శిష్టుడైన బ్ర
హ్మర్షి వసిష్ఠుడై - గురువు, మానిత విద్యల నేర్ప - రాట్సుతుల్
కర్షిత వజ్ర తుల్యులయి కాంతిని నింపిరి నాల్గుదిక్కులన్ 131

## శ్రీరామాదుల బాల్యము

దశరాథరాజు రాణులు ముదమ్మునకున్ హృషికిన్ బ్రతుష్టికిన్
వశులయి రాత్మ సంభవుల వర్ధనముంగని; సూర్య కాంతికిన్
వశమగు పూవులట్లు నడువన్ దమ చూడ్కులు - వారు ముచ్చటల్
విశదము లెల్లజూచెదరు; వేడుక దృశ్యము - సందెవేళలన్ 132

అదియొక రాజహర్మ్యక ముఖాంగణమల్లదె బాలకాగ్రణుల్
పదుగురు జట్టుగా గలిసి పంతము, వంతులు జెంతజేర, సొం
పొదవగ నాటపాటల మహోత్సవ మందున మున్గి, పొంగి, తే
లి- దరువు చేయుచుండిరి - వలీముఖ మేళకమన్న జెల్లుబో! 133

ఒకటే కలకల మచ్చట
నొకటే కోలాహలమ్ము - నొకటే  కేరిం
పొకటే గలగల - గుండెల
కొక పుప్పొడి నలదిన గతి నుత్సాహముగన్! 134

అందఱిలోన బెద్దయు మహాగుణమండలి దానెయైన వా
దందమె సంతకమ్ముగ గృతార్థత జెందిన చోటు తానెయై
వందితుడైన వాడు - రఘు వల్లభు డందఱి తోడునీడయై
సందడి కందమిచ్చెను - ప్రసన్నత పూవులు పూచినట్లుగన్ 135

ఆ రాముని గని యితడే
మా రాము డనుచు మురిపెము మలయన్ లోలో
శ్రీరాముని జననీజన
కారాధన ముల్లసిల్లె నభిమతపూర్తిన్! 136

నిల్చిన భంగిమంబుగని, నిర్మలమౌ తలసాల గాంచి ని
శ్చలమగు దృష్టిజూచి, పటుసత్త్వుని రాముని దేరజూచి, కో
సలపతి పుత్రి స్వాంతమున - జల్లని ధన్యత జల్లుపొంగె, ద
త్కలఫలితమ్ము - పున్నెముల కానుపు కన్‌జికిలింపు దేర్చగన్ 137

అటు భూమీపతి హృష్టుడయ్యె దనయుండా శ్రీరాము  శ్రీశోభగాం
చుటచే, నాపయి నీలమేఘఘనవర్ణుం డాత దందమ్ముగా
జటులభ్రాజిత మూర్ధజౌఘమును దా జక్కొన్పు తీరున్ గనన్
జిటి కొక్కుండది యప్రయత్నముగ జేసేతన్ దొలంకె న్నెఱిన్ 138

తన కన్నుల్గని నట్టి దెంతటి మహద్భాగ్యంబొ, సంస్కారమో
తన కన్నుల్గని నట్టి దంతటి మహాధన్యత్వ సత్ప్రాప్తియే
ననుచున్  గన్నుల నీరు నింపుకొనె; నింతై యంతకంతయ్యె - చే
తన, సంభావన మాటలాడదొడగెన్ ధాత్రీశు చేతమ్ముతోన్ 139



గతమున నతనిని కొలిచిన
శతకోటి శరీరుల నొక సకినను కాబో
లతులిత భాగ్యము కలిగిన
దిత మిది యని మురిసె నృపతి యెలసిన యెలమిన్ 140

భానుకులాలంకారుడు
సానుజుడై యాపగిదిని సయ్యాట జగ
న్మానితుడౌ లీల గనుట
యే నోముల పున్నెమొ యని యేలిక తలచెన్ 141

కూడలి కొమ్మలౌ సుతులు కూరిమిగా నరచేతి నిమ్మలై
వేడుక జేయుచుండ బృథివీపతి - హర్షపు గాలివీచులం
దాడుచు దేలితేలె; సుఖమంతయు గుండెలకందయౌట; న
మ్మాడికి రాణులందఱును మానిత సమ్మతి నెక్కి రయ్యెడన్ 142

ప్రాంగణమునందు తమ దృష్టి బర్వజేయు
క్ష్మాపతికిని రాణులకు నిక్ష్వాకు వంశ
పరిగణిత భూషలవి - నేత్ర పర్వమయ్యె
పుటపుట నయి నట్టి వెలుగు పూవులట్లు! 143

ఒక సంఘమ్ముగ జేరి, గూళ్ళు విడి హర్షోత్సాహముల్ పొంగ
నొకచోటన్ లలి వాలి లీల మెయి దా మూవాడుచున్ గుంపుగా
నకలంకద్యుతి - వెన్నముద్దలుగ దృశ్యంబైన కాపోతమై -
సుకముల్ బంచిరి తల్లిదండ్రులకు - రాట్సూనుల్ - ప్రభాసూనులై! 144

పాఱిగంతులు గోడిపట్టెలు నాపైన
కోతి కొమ్మంచులు - కొంతసేపు
గంగెద్దులాటలు, కనుకుట్టు లామీద
కోలకోలన్నలు - కొంతసేపు
బందారు బసవన్న బండ్లకల్లు లటుపై
కుప్పిగంతు లిఱికి - కొంతసేపు
బొంగరాలాటలు, సింగన్న దాటులు
గోరింపు బంతులు - కొంతసేపు

నాడియాడి, యురవడించి, యాట నడుమ
నొకరిపై యొక రేవియో యుగ్గడించి
కొండెముల్ దెల్పి, తుదితీర్పు గోరి – రాము
ముంగిట నిలుతు రుత్కంఠ మురియబడగ! 145

ప్రకట క్రోధము మీఱనొక్కడను, "శ్రీరామా– న్యాయంబు నీ
విక తేల్చన్‌వలె; చిద్గుదందితడు – వేవే మా బరిన్‌జొచ్చె; కూ
తకు దమ్మింతయు లేక – యాపె; వెనుకన్ దక్కోలుగా పట్టు కొం
టి; గరాళించుచు నన్ను నెట్టి – చని – వాడీరీతి దాష్టీకమై
వికటించెన్, గనుమా – విచార్యమిది – వేవే దీర్పు నందించుమీ" 146

శతపత్రంబుల కొక్క నాళ మదియే సంబంధ, సంభార, సం
భృతి జేకూర్చెడు భంగి– సర్వగుణ సంభేదాత్మకుండైన – స
న్మతి శ్రీరాముడు – సర్వతోముఖుడు – నైర్మల్యంబుతో నిల్చె, బూ
జిత ధౌరేయుడునై సుహృత్సమితి జేజేల్వెట్టి మన్నించగన్ 147

నొసటన నల్లల నాడుచు
ముసురు నలకల సవరింత మొనపెడు మురిపెం
బెసగగ రాముడు సఖులకు
హసనమె బదులిడుచు, డాసి, యనువగు రీతిన్ 148

సొబగులన్ని తనకె స్రోతోంజనము కాగ
ధీరలాలిత్యమ్ము తివురు కొనగ
నాగ్రహించిన వాని నదలించి గద్దించె;
బెంబేలుపడు వాని వెఱపు నాపె,
మోసంబు పాటించి మొనకాని వెట్లవు
దీవు నేస్తమ యని యిఱుకు బెట్టె
నాటలో ననటి పండను కోర తమ్ముడా–
యని బుజమున చేయి యాన్చి పలికె,



అన్న పలుకు తీరుగనుచు చిన్నబోయె
నిందితుడు, వాది మ్రింగె నా చిందు నదియె;
'యాటలోని యనటి పండు'; నతిచతురత –
రాఘవుని తీర్పులో నొదుగుచు రస్యమయ్యె! 149

రాముని మాటలోని యనురాగము, యుక్తియు, లక్ష్య లక్షణా
భూమిక తత్త్వమున్ గనుచు భూపతి, రాణులు, రాచవారు – "యే
మేమి సమర్థతా రచన మీతని కత్తికి రెండువైపులన్
బామిన వాడియే పదను బట్టిన దంచును, విస్మయమ్మునన్ 150

ఇది యే నోముల ఫలిత
మ్మిది యే సుకృత పరిపాక మిది యే భాగ్యం,
బిది యే కలుముల పంటకు
కుదిరిన సిరి నారుపోత; కొఱ కైసేతల్! 151

అని యనుకొనగా బర్హా
ళి నొదిగి నిలు నల్ల ద్రాక్ష లీలను బలుకుల్
దనరెన్; వారెల్ల రధిక
ధనికులయిరి రాముని కనుదమ్ములు విరియన్. 152

పరగు వడగాడ్పు తఱి నీడ పట్టునందు
చేతి కందిన ఉప్పు మజ్జిగరసమ్మె
యగుచు దక్కెను – దృశ్య మహాసమృద్ధి
ఇరవుపడిన పూరాకృత మిదియె నిజము! 153

**కల్యాణాన్వీక్ష – విశ్వామిత్రాగమనము**

ప్రజలు సఖులు మిత్రామాత్య బంధుజన మ
ఖిల శుభప్రసంగముల దగిలి వెలుంగు
హర్ష తరుణమున – పురపు, నంతిపురపు
టెడద లుత్సాహ మగ్నమై యెగయువేళ; 154

తనదు గుండె గదుల కమ
ర్చిన నాల్గు కవాటములన శ్రీరామాదుల్
దనరగ దశరథుడాలో
చన జేసె సుతుల వివాహ సంగతులమరన్ 155

వచ్చెను వార్త కౌశికుడు వచ్చుచునుండె నయోధ్య కంచు; దో
డ్తెచ్చిరి సంప్రణీతలు, విధేయత మీఱగ మంత్రులెల్ల తా
మిచ్చిరి స్వాగతాంజలి, మునీంద్రుని మ్రోల జనంబు వ్రాలగా
జొచ్చిరి – భక్తి పూర్వక వచో విభవోత్సవ మూన్చుచున్ దగన్ 156

అక్షర సైన్యము గతి బ్ర
త్యక్ష మహాకావ్య రస పయస్విని వోలెన్
సుక్షేత్ర మయోధ్య నొలసె
సాక్షాత్ బ్రహ్మర్షి – యర్థ సంచలనము నాన్. 157

అడుగునకు మడుగొత్తెనో – యడుగుప్రక్క
అడుగునుంచెనో; అతి విధేయతయు భక్తి
నిధువనము గదిరెననగ – నియతమతిని
దశరథుడు తానె తోడ్తెచ్చె దపసినపుడు 158

తన యురు సత్త్వమునకు కే
తన మెత్తిన నృపతికోటి, తన జనమును వం
దన శతమిడు పేరోలగ
మున ముని కాహ్వాన మిచ్చె మునుకొను భక్తిన్ 159

అతిథి మర్యాద సలుపుచు నర్ఘ్య పాద్య
ములిడి, ముని సమూహపు సేమము లడిగి వర
పారమార్థిక భావన వరలు మదిని
నయవినయముల బల్కె విన్నాణమొప్ప 160

'స్వామీ, మీరు మహాత్ములు!
ఏమో ఇటు వచ్చినారు – యిది మా పుణ్యం
బేమో – సెలవీయవలయు,
మా మానసమున ధృతికలమము పెంపారన్ 161

స్వామి మీరాక మాకు వర్షాంబుదమ్ము
ననుపమానంద కల్ప ద్రుమాంకురమ్ము
మీయనుగ్రహ మీరీతి మేలుకోరె
నిదియె – ఆశీర్వచన శతమ్మిదియె రక్ష! 162

తాము సుమనకృతులు గావుత నెనరెసగ
నీ విధమ్ముగ నవకాశమిచ్చినారు
ప్రీతి నాతిథ్య మీయ సద్విమలమూర్తి!
ఆనతీయుడు చాలు నేనాచరింతు! 163

తాము కోరుటే మా మహద్భాగ్యమయ్య
కదలివచ్చెను మేరువు, ముదము నిండె
ముదలవెట్టు డదియె నాకు ముదము గూర్చు
నేమి కోరిన లేదన; నిచ్చువాడ! 164

ఉత్సాహులు కల రిక న
త్యుత్సాహులు కొందఱు: సరి: యొడలెరుగరు తా
ముత్సేకము జూపింతురు,
తత్సంధానపు ఫలితము దలపోయ రొగిన్. 165

లోకరీతి సరళి యిది, లోతుపాత
రయక మాటాడు నృపతి వర్తనము జూచి
యింక, సభ మౌనముద్ర వహించె, సభ్య
గణము నుద్విగ్నమయ్యె, నుత్కంఠ హెచ్చె! 166

వీరిని మఱి వారిని తేఱిపాఱ జూచె
గుశికసుతుడు, రాజు పలుకు గుప్పిట గొనె
పయికి చిరునవ్వు, లోన సుస్పష్టవాంఛ
వీచ, గనుచికిలించె - గంభీరమూర్తి! 167

ఒక చికీర్షా ప్రభావ సముద్యోగి యగుత
సాదరుండగుచు పలుక సాగె మౌని-
గళమున జలతరంగిణి ఘటన కదల
'సపరివారాయ నరపతే స్వస్తి' యనెను. 168

స్వనమది ప్రతిభా భాస్వర సదృశమయ్యె;
వ్యోమవేశ్మమ్ము మెఱపుల వ్యూఢమెల్ల
దివిరి యుఱుముల కొనసాగు తెఱగు దొఱయ
గడమ - నసలు సంగతి బయల్వెడల సాగె; 169

"అగునగు నీకు నీ ప్రజల కంచితశ్రీలు, భవాన్వయోచితం
బుగ దగుమాట యిచ్చితివి, మోదము మీరగ గోరుచుంటి..." 170

అని క్షణ మాత్ర మాగె ముని, యాపయి భూపతి జూచె, పౌరులన్
గనె, గరలాస్యమున్ సలిపె, గాలిని లోనికి బీల్చి నిల్చె - నే
మనక, నృపాలుడున్ బ్రజలు నంచులు పాఱిన వేగిరమ్మునన్
మనసుల నుగ్గబట్టుకొని మాటలు చేష్టలు దక్కి నిల్వగన్. 171

వినయము విస్మయంబులును వెంబడి ద్రోయ ధరాధిపుండు "మీ
రనుకొని నట్టిదేమొ, మొదలైన దదేమొ వచింపుడయ్య, మీ
మనమున గొంకులేల? యనుమానములేక యొసంగువాడ, మీ
రనుమతి జెప్పరే యన శుభాశయభావన మౌని యిట్లనెన్ 172



## విశ్వామిత్రుని సంకల్ప సృష్టీకృతి - దశరథుని అనాసక్తి

యాగము నిర్వహింపగ శుభాశయ మొక్కటికల్గె, వెంటనే
రేగిరి కార్యమున్ నిలువరించుచు; తాటక బిడ్డ లిర్వురున్
మూగిరి - రక్తమాంసముల ముంచుచు హోమనివేశ మెల్ల దా
మేగతినేని ధ్వంసమొనయించెడు నీచపు బుద్ధి రేగగన్ 173

ఆ మాయావుల చేష్టలు
నా మాయోపాయ కేళి నణచగ మాదౌ
శామిత్రపు రక్షణకై
రామాహ్వయు బంపుమయ్య రాజాధీశా! 174

పిచ్చుక పయి బ్రహ్మాస్త్రము వేయరాదు;
దీక్షలో నున్న మా మంత్ర దృష్టి వేరు
వేరు దిక్కుల వెంబడి వెడల కూడ
దాచి తూచి చేసితి నిర్ణయమ్ము; కాన... 175

"సొం / పుగ ప్రియపుత్రుడైన రఘుపుంగవు బంపుము నాదువెంట, మా
కగునగు యజ్ఞరక్ష, తమకౌ శుభసౌఖ్య విజృంభణంబులున్" 176

ఉలికి పడెను రాజు, యుల్లము ఝల్లనె
నదరె, దొట్రుపాటు కదుర, గుండె
లో యరల పొర ప్రిదులుచు నుండ, నొకవంక
బెగడువడ బడిసెగ దగిలె నెదకు! 177

ఉరుమని పిడుగై, విసిరిన
శరమై, కసరిన పలుకయి, సడలిన బహు సుం
దర తర దృశ్యమునై ముని
వరు కోరిక రాజు కయ్యె వాలాయముగన్ 178

అనియెన్ భూపతి "ఓ మహాత్మ! తమదౌ నాజ్ఞానుసారంబ మీ
పనికై నేనుగ నేగుదెంచి దనుజ ప్రాచుర్య సంహారణం
బొనరింతున్ దమ యాగ రక్షణము సంపూర్ణంబు గావించు కొం
దనుగుం గుఱ్ఱను వీడుమయ్య! కసుగాయన్ గోరి వేధింతువే! 179

ఉడుము నెరవేర్చు కార్యమ్ము నుడుత చేయ
గలదె? మోకు పేనుటకైన కావలెగద
పురికి నిలబడగల నార! పుణ్యపురుష
సుంత యోచింప మీకోర్కె సుకరమగును. 180

ఇంత యెఱింగి గాధిసుతు డిట్లనె "భూవర! కార్యభార మా
వంతయు వంత గూర్చ దొక పట్టున ప్రశ్నము గాదు, శ్రేయముల్
చెంతకు జేరు, నింక చిరజీవిని – నైజమనోభిరాము, న
త్యంత ప్రశాంతతన్ బనుపు, మాపయి బాధ్యత – మాది గావుతన్ 181

భారవహుడు ఘనుడయ్యు బరువునెత్తి
కెత్త గావలె జేయూత నిచ్చి యొకడు;
సన్నివేశపు సంభావ్య సరణి దలచ
నౌకరి కొకరు తోడుంట యుక్తమందు. 182

పలు పలుకులను నే వచింప బనిలేదు
చాయమగని తెగ కడలి చందమామ
రాము డొక్కడీ శుభకార్య మోమ జాలు
విశ్వశాంతి నపేక్షించు వివధ మిదియె! 183

అని వచియించె దిట్ట తనమంతయు మాటలలోన దించి, య
య్యనఘుడు – సన్నివేశ సమయమ్మునకున్ లయగూర్చె, నంతటన్
జనవరు మోము జూచెను; ప్రజావళి సవ్వడి గాంచి యాగుచున్
దనదు ప్రశాంత నిశ్చిత విధానము మోమున వెల్గునింపగన్ 184

చూపులో చూపుగా గ్రుచ్చిచూసె గాధి
సుతుడు, దశరథరాజు నశ్రువులు నిండి
యున్నకన్నులు – కూపము లూఱ్ఱు దోచె;
ప్రత్తికాయల డొల్లల పగిది దోచె! 185

ఉబుకుదుఃఖము, నుప్పొంగుచున్న బాధ
కలుగుచున్న కలగు, ఎద కరగుచున్న
వెతయు, మరగు విచారము వెన్నునిండె
జింతలో రాజు చీకటి చెట్టుగాగ! 186

నా యారవ ప్రాణంబగు
నాయన – నాయన! దశరథ నందను దకటా!
న్యాయమె – బాలకు నడుగుట
నా యీ కనులడుగుమయ్య నయముగ నిత్తున్ 187

నా కన్నులతో జూచిన
మీకే యవగతము స్వామి – మెలపున నత డే
వీకన్ దనరునొ; నతడే
మా కోటివరాల మూట – మన్నింపదగున్ 188

పుత్రుడు నీకు గావలయు ప్రోడదు, యుక్తుడు; నాకు జూడగన్
బుత్రకు డీతడో యనఘ! పున్నెపు బంటయు జిన్నవాడునున్
పాత్రత సంగతిన్ మఱచి వాకొను వాడనుగాను కాని, యీ
చిత్రము – త్రాడులేని యొక చిక్కుగ మారెను గొంతు చుట్టునున్ 189

రాముడె ఊర్పు నాకు, రఘురాముడె గట్టిదు కాలుసేయి, నా
రాముడు చూపు, మా వినయరాముడె నాకగు తిండి తీర్థముల్
స్థామము, రాముడే చలనశక్తియు, దండను పచ్చబొట్టు, నా
రాముని బల్మిమై పెఱికి రాయిడి ముంచెద వో మునీశ్వరా?! 190

చలియింప  జేసెను మనో
బలము, నరపతి పలుకు విభక్తంబై, లో
పల వెలుపల నేమాయెనొ
తెలియక, కలగెను, కలగొనె, తెవులును బడియెన్ 191

పది పదారేండ్ల లేత్రాయము వీడదు
మాతాపితృవియోగ మధనమేల?
విద్యలు పూర్తిగా విశదము గాలేదు
యాగరక్షణతోడ వేగుటెట్లు?
లోక సరవిని విలోకించగా లేదు
మాయావి చెనకుల మాన్పుటెట్లు?
తనువు మనసు పటుత్వము కుదురుకొనదు
శత్రు సంహారంపు శ్రమమదేల?

అని కదా మహీజాని నీ మనసు ప్రశ్న?
గుండె గొంతుక లోనుండి కొట్టు కొనుచు
నున్న భయ మే నెరుంగుదు, నోహటిల్ల
రాదు, కఠిననిర్ణయము సమాదృతమ్ము! 192

చేయరాని పనిని చేయవలసి వచ్చి
నట్లు దేనికింత యదురు, బెదురు?
పండు కోరువాడు పడక తప్పదు పాట్లు
విత్తునాటి నీళులెత్తి పెంచి! 193

మొక్క కనువిందు జేయు, సమ్మోదపరచు
పూచి పుష్పించి మురిపించి పొసగు గనుక
తరువుగా నది యెదుగ రాదనుచు, పూని
దానివృద్ధి, నభివృద్ధి దరుగజేయ; 194



వెఱ్ఱితనము గాకున్న వివేక మగునె?
మాను గానీయ వలయు నద్దాని మఱియు
నలుగురికి నీడయగునట్లు నిలువనీయ
వలయు; నిదియె బాధ్యత కాదె నిలిచి చూడ! 195

తండ్రి చాటు బిడ్డ తనయుండు విద్యార్థి
రాఘవుడు వెలుపలి ప్రాణమంచు
బేలవై దిగులుగ బెంబేలు పడనేల
రాముడెవ్వడొ నీకేమి తెలియు! 196

నృప! 'అహంవేద్మి'! శ్రీరామునెప్పు; ఒక మ
హాత్ముడతడు సత్యపరాక్రమాన్వితుండు;
తీరు – దాపస స్థితులు, మహాతేజుడైన
యీ వసిష్ఠుడు నెఱుగు సమీక్ష జేయ! 197

రక్కసుల దునిమి సవన రక్షసేయ
నతని సత్త్వము తత్త్వ మహత్వ మదియె
కావలయు వంత యేల సత్కాలమందు
కొడుకు శక్తి యుక్తి తెలిసికొనుము సుంత!' 198

శ్రీరఘువరుడు బహురూప శ్రేయములను
మఱియు త్రైలోక్య కీర్తిని వరలువాడు
వాని బంపగ నాయంత వాని తోడ
నడకకే శుభప్రదమగు నాంది తనరు. 199

అనియెడు గాధిసూను గని యయ్యవనీపతి తేఱికొంచు చే
సిన తనబాస యెంత చెడుచేసినదో కనువిప్పు గాగ, ఔ
నని యనలేక, కాదని యనన్ మదిరాక – పెనమ్మునుండి తా
కనకన మండు పొయ్యి బడెగా యని కుందుచు, సంశయించుచున్ 200

నెత్తిని సమ్మెటతో - వెస
మొత్తిన విధమై శరీరము గుదివడ, భయం
బత్తుకొన గుండె నెల్లెడ
సత్తువ దిగజారి పోవ సరగున ననియెన్ 201

గుండెపై వేటు, మనసులో గుబులు, తట్టు
కొని నిలుచు శక్తి చాలదు, కుదురు గూర్చి
ఆర్తి బాపుము కుశికాన్వయాబ్ధి చంద్ర!
రాము వీడు మిడుము నాకు బ్రాణ రక్ష! 201

అనుచున్ గన్నుల నీరునిండ, నధరం బల్లాడ ఖేదంబు గూ
డిన యాలోచనలెల్ల మానసము బీడించంగ, వేధించ గ్ర
న్నన ధైర్యమ్మును నిబ్బరమ్ము మరుగై నైస్పృహ్యమున్ గూర్చ డి
ల్లన కూలెన్ మసిబట్టవోలె ధరపై, లావెల్ల బేటెత్తగన్ 203

తా - పసిపసిగా నొక పసి
పాపను బోలె దురపిల్లు పార్థివు గనగన్
గోపము కన్నుల జిమ్మెను
తాపసి కంతట, పలుకు విధము మారె నిటుల్ 204

కథలను చెప్పబోకుము కకావికలైన మనమ్ముతోడ, స
త్కథగల దేవకార్యము సకామ్యము కావలెనంచు జెప్పితిన్
బ్రథిత యశండగున్ సుతుడు వానికి బంధనమేలయన్న నా
గ్రథనము నీకడన్ నిలిచెగా - బధిరుంజెవి శంఖనాదమై. 205

అని ఛీత్కారము జేసెను,
తన దక్షిణ హస్తమును విదల్చుచు విసుగున్
గనపడ జేసెను; పద తా
డన మొనరించెను; కినుకను డాపక ననియెన్ 206



మీ రఘు వంశస్థు లెవరు
నేరని చర్య కొడిగట్టి నింద్యుడవై - భూ
దార - సుఖంబుండుము నీ
దారాసుత బంధుగణము తనియగ బ్రీతిన్ 207

చాలుంజాలు ననవసర
మాలాప విలాపము లిక; నర్థము తెలిసెన్
నీ లావెరిగితి, నీ కసు
మాలము నోర్వను వెడలుదు, మతి - జాగేలన్ 208

### వసిష్ఠుని హితోక్తి

అంత వసిష్ఠుడున్ మరియు నాప్తులు ముఖ్యులు జంకి, ఘర్షణం
బెంతటి కెంత జేసెను మునీశ్వరు డింతగ నాగ్రహించ నే
వింతలు ముంచునో యనుచు స్వీయవిధిన్ నెఱవేర్చ బూని య
త్యంత కృతజ్ఞతన్ దలచిరందరు - సంశయ విస్మయాత్ములై 209

పొంతన సేయ ముఖ్యమని, బోధన జేయక దప్పదంచు, ను
ద్భ్రాంతి వహించ రాదనుచు - బంక్తిరథున్ మునినాథునిన్ సమా
నాంతర దృష్టి జూచి పలుకాడ బ్రయత్నము జేయువారి న
త్యంత సమాదరమ్ము గని తాను వసిష్ఠుడు లేచె ముందుగన్ 210

"అయినదైనది చాలునో యార్యులార!
కాలహరణ మీయదు పరిష్కార మెపుడు
వ్యర్థభాషణము మిగుల్చు స్పర్ధ నెపుడు
వలయు విషయ వివేచన - ఫలిత మిచ్చు" 211

మునివసిష్ఠ ప్రకటన సమ్మోదమిచ్చె
జనులకును; మునులకు - సభ సద్దుమణిగె;
మనసుబట్టి లాగెడు చూపు ననువు జేసి
పలుకువాలు సాగించె తాపసవరుండు 212

విశ్వామిత్రుడు నిప్పురవ్వ వలె గన్పించున్, భయోత్పాతముల్
విశ్వంబంతయు గల్గు రీతి గినుకన్ విన్పించగా జేయు గా
నీ, శ్శ్రేయసమున్ దలంచు, చెడు కే దే నౌషధం బీయగా –
నశ్వల్ గూడిన వైద్యురీతి, విజయం బందించు భ్రాజిష్ణువై 213

ఈ వరముని చంద్రు డిచటి
కీ విధి వచ్చుట తనుజుని కీరితికిం – గా
దే, వడివడిని శుభాకాం
క్షా వర్షము కురియు, నిజము; సంయమి మాటన్... 214

శిరసావహించి పంపుము
వరగుణ శోభితుడగు రఘువరు మునివెంటన్
సురకార్యము, మా ధ్యేయము
కరమగు, నెరవేరు నెల్ల కలములు నధిపా! 215

అంతటి రాజచంద్రుల శుభాకృతి హారములోని మౌక్తికం
బంతటి వాడవీవు, నృపులందఱి లోనను మేటివయ్య, భా
స్వంతకుల ప్రసిద్ధి కొక వన్నె ఘటించిన వాడవైన నీ
వింతగ మాట దప్ప పరువే ప్రభు? నీకును మాకు జెల్లునే? 216

చెప్పెడు మాటలాపిన వసిష్ఠుడు తానుపవిష్టుడయ్యె, నే
తప్పులు దొర్లకుండగ నిదానము నిగ్రహమున్ జెలంగగా
నొప్పెను సన్నివేశమని ఔచితినెంచుచు భూధవుండు దా
తెప్పరిలెన్– గలంతవిడి, తీరెను గాలి బిగింపు లచ్చటన్. 217

తన పురోహితు సరళవచనము వినిన
పంక్తిరథుడంత సభ్యుల వంక జూచె
మనసులందు మథన మనుమాన మగుట
గొలువు కూటము నిశ్శబ్ద కూటమయ్యె 218

ఈ వర్తమానము తెలిపి
రావించిరి రాజుల మువురన్, వారున్ వా
రావశ్యక విధి వచ్చిరి
సేవనమును జొచ్చిరి తెలిసికొనగ వినగన్ 219

కనగ, నప్పటికే జరిగిన ఘటనము,
నప్పుడు జరుగుచున్న యంశమెల్ల
నిక జరుగబోవు మిశ్ర సమీక్షణమ్ము
ప్రేక్షక శ్రోతృపాత్ర నుత్ప్రేక్ష జేయు! 220

తథ్య మీ ప్రతిపాదన – ధరణి జనుల
కభ్యుదయ సముజ్జ్వల విజయాభివృద్ధి
బంచు, మంగళ ప్రదమగు నంచు బలుకు
గురుజనము దీవెనల యొప్పుకోలు వింటి! 221

నవ్య సంస్కార సాఫల్య నాడి వినగ
శుభకరంబైన యీ జనశ్రుతిని వినగ
నీ సమాసక్తి మిశ్రీకరించె నిట్లు
కొన్ని కూకటి రేకలు కుదురుకొనియె! 222

ఆగి, దశరథుడు–సభ, సభాంతరముల
గలయ జూచెను, సభ్యుల కనుల దొనకు
దృష్టి మినుకు, నూపిరి మెచ్చు నెఱవు
మెఱపు గమనించె, కమ్మ తెమ్మెరలు వీచె! 223

స్వయముగా నేగి రామలక్ష్మణుల తోడ
తిరిగి వచ్చె దశరథ క్షితిపతి; కోస
లాధిపు తనయ, తాను–స్వస్త్యయన తతుల
జేసి ముద్దుడుచు బ్రశాంత చిత్తులైరి! 224

అట చనుదెంచి రా రవికులాంబుధి చంద్రుడు రామచంద్రుడున్
పటుతర భ్రాతృసేవయును భక్తియు శ్రద్ధయు గల్గు లక్ష్మణుం
డటుపయి నిర్వురున్ సవినయార్ద్ర నమస్సుల పంచి; తాముగా
నటగల ప్రస్తుతాంశము వినన్ సమయజ్ఞత వేచియుండగన్. 225

కోరకస్మేర కింజల్క కిరణము లన
నాగమించి వా రుచితజ్ఞతాది సకల
రాచమర్యాదల నమ్రత నాచరించు
సదమల సరణి జూడ ముచ్చటను గొలిపె 226

సుమనోహర రూపము, రూ
పము మించు నయము, నయము నుపచయము జేయన్
సమయజ్ఞత, సమయజ్ఞతఁ
సమున్నము సలుపు గభీర సంజ్ఞలు బూయన్ 227

చీలిన అగ్నికీలలు సచేలముగా నట నిల్చినట్లు, స
చ్ఛీలము వృక్ష శాఖలుగ సేమము గూర్చగ విచ్చినట్లు గన్
మేలగు రత్నరాశి జిగిమించగ నత్తఱి మానుషాకృతిన్
గ్రాలినయట్లు తోచె సభిక ప్రకరంబున కద్భుతంబుగన్ 228

## దశరథుని అంగీకృతి – పుత్రులకు హితోక్తి

మరియొక మారు చెప్పదగు మాటల దెల్పుచు రాజు వాకొనెన్
స్థిరమతి మౌని పుంగవు దుదీర్ణగుణాంచిత పుణ్యమూర్తి యా
దరము వహించి లోకశుభదంబగు యాగము బూన, వారితో
నరుగవలెన్ మునీశ్వరుని వ్యాహృతి నౌదలదాల్చగా వలెన్ 229

పితృహిత వచన మంతయు విన్న సుతులు
శిరసులను వంచి నతులను జేసిరపుడు –
వెచ్చవెచ్చని యనుభూతి వేడ్కజేసె
మనము మధురోహ పల్యంక మనుమతించె 230

నాలుగు వైపులన్ గనె జనాగ్రణి, యీకడ బుత్రులున్; శుభా
ర్థాలపనంబు జేయు మును లాయెడ, హర్షసుచేలకమ్మునే
తాలిచి యున్న పౌరులటు, దైవికమన్నది యోగమంచు వే
వేలుగ భావజాల మెద వెల్లువ లెత్తుచు దోచె నెల్లెడన్ 231

అంతమునీంద్రు జేర జని "యార్య! తమంతటి వారి నొచ్చు నం
తంతటి వర్తనన్ సలుపు నంతటి వాడను కాను కాను, ది
గ్దంతులు తల్లడిల్లగ పితామహుసృష్టికి మారుసృష్టి క
ల్పింతు నటన్న హుంక్రియను పెక్కుగ జూపిన మిమ్మెఱుంగమే! 232

భవదనుజ్ఞ, వసిష్ఠ నభయ వచనము,
సుతుల యుత్సాహ ధైర్యముల్ శుభ్రయోగ
మిచ్చె; విచ్చె హృదబ్జముల్, వచ్చె నుభయ
సంధ్యలోకపరి, తెచ్చె భాస్వంతకాంతి. 233

శ్రుతిమొద, లటుపై నుచ్చరించుటయు, స్వరము,
నాపయిని వ్రాతఁ – జీవించు నక్షరమ్ము;
మిమ్మనుసరింత్రు సుతులట్లు, సమ్ముదమున
సాగనిండిక మీదు కృపాగమమ్ము! 234

అని మదిలోని సర్వవిషయమ్ముల నచ్చట గుప్ప బోయుచున్
జనపతి నాల్గు వైపులను జాడల జూచి సభాంగణమ్ము మ
ధ్యన గల రామలక్ష్మణుల దగ్గఱగా జని గద్గదస్వర
మ్మున బలుకాడ బోవ యెద మోడిచి వాతెఱ నాగిపోవగన్ 235

సుతుల మూర్ధముల నిమురుచు నతి వత్స
లత పొగుల బుజముల తట్టి లస్తకమ్ము
ముట్టి, తన మస్తకము వంచి, మురుపు వెన్క
వదలి, వెనుతిర్గి తన పీట పజ్జ జేరె 236

రాజు చేష్టల, సుతుల నమ్రతను జూచి
ముని వతంసు లర్థము చేసికొనిరి, తమకు
తామె తాత్పర్య మెఱిగిరి – "తండ్రికి నర
చేతి నిమ్మపండ్లు నిజమీ చిట్టి జంట"! 237

మోము పయి చిరుచెమటల ముత్తెములవి
యెంతొ కనువిందు జేసె రాజేంద్రు సుతుల,
నొక్క యుగళగీతమ్ము రసోద్భవమ్ము
నొసగెనాన్ సభా ప్రాంగణ ముల్లసిల్లె 238

జ్ఞాననేత్రముల గనిన కార్యఫలము
తలచుకొనుచు, మనస్సుల తమకు తాము
మురిసి, దైవకార్య చికీర్ష ముందు నడువ
కదలినా రుపమించ సింగంపుజంట. 239

శత సహస్ర భావ సంకుల మ్మెదలోన
ఘర్షణలు రగుల్ప, క్షత్రియ విభు
డాప్త వత్సలత్వ మదర, మమత మీఱ,
నిలిచి, మనసు దెలుప బలికె నిట్లు. 240

'ఇతడు– సంస్కారచయ రూపు; డితడు వేత్త,
ధీర సంవిత్స్వరూపుండు, ధీయుతుండు;
వారి పలుకు మీకిక వేదవాక్కు సుమ్మి;
యేమి చెప్పిన దాని పాటించవలయు' 241

రాముడు లక్ష్మణుండును సరాసరి తల్లుల చెంతకేగి నా
రా మహనీయ మూర్తుల కనన్య నమస్సుల నిచ్చి, భక్తి భా
షా మహిమోన్నతిన్ గరమొసంగుచు నొక్క యపూర్వ ఘట్ట మా
రామమునందు నిల్పి మృదు రాగము నిచ్చిరి భావశిల్పులై. 242

సెలవిక పోయి వచ్చెదము, సేమము లాభ మపూర్వ మంగళా
మల జయకీర్తి నెత్తికొని మాన్య జనావలి ప్రస్తుతించగన్
వలసిన యట్టు లీ పురికి వచ్చెదరీ 'కసుగాయ'లే – ప్రమే
య లిఖిత కావ్యకర్తలు మహత్పరిణేతలు వారె వారనన్ 243

అనుచును ముందుసాగె కరుణార్ద్రత జూచుచు నెల్లవారలన్
ముని కుశకాత్మజుండు, ననుమోదము మీఱగ రామలక్ష్మణుల్
వెనుకగ వేగసాగ – గడు వేడుక యయ్యెను – దృశ్యమంతయున్
వినయము కేలబూని జను విద్యకు రూపము చేరినట్లుగన్! 244

మహితపూజిత వేదద్రుమమ్ము మౌని;
బాలక ద్వయమ్ముపమించ బోలు నింక
ధర్మ సంభూత రుచిర వేదాంగ శాఖ
తనరు పనసల పిల్లకాయలనగ – కనగ! 245

దనివి తళుకులలదినది మనసునీ స
మీకరణము 'నాది' కవి వాల్మీకి మొదలు
కవులు నేటి దనుక రస కావ్యరీతి
మీర వర్ణించినారు సుశ్రీరహించ! 246

గగన వనమున త్రిదశ నికరము విరిసె
చతురుదధుల గడలు యశః స్నానమాడె
భూనభోంతరముల దుందుభుల నినాద
మెగసె; పౌరుల యుత్సాహ మెసకమెసగ! 247

రాజ గౌరవ తాత్పర్యరక్తి – మరలి
రామలక్ష్మణ ప్రేమానురాగ మయ్యె
పూర్వరాగంపు సౌరుల బుడమి పట్టి
పుష్పవతి యయ్యె శ్రీరాము పూజకొఱకు! 248

పునరుక్తి జరుగు - నాందో
ళనమున, నానావిధంబులైన తలంపుల్
మనమును ముసరగ; నటులే
కననగు దృశ్యసరసి పదకమలము లమరన్! 249

అచ్చుగూర్పు, సుస్పష్ట దృశ్యంపు బేరు,
ధ్వని చమత్కృతి, రమ్య సంధాన శోభ,
నాటకీయత, పాత్రల మాట తీర
దరు రసాకృతి - పదచిత్ర మిరవు దేరె! 250

అనియని యిటులీ మధుర వ
చనోత్సవమ్మును జరిపిరి సత్హృదయులకున్,
జనులకు నాహ్లాదముగన్;
దనరెను ఘట్టము కథాసుధలు జాల్వారన్! 251

**'వెడలెను కోదండపాణి...'**

సరగున జని ఆమడపై
నర యామడ, పిదప కుశికనందనుడున్, బా
లురు నాగిరి; ఎదురుగ నది
సరయూనది వలకడ దరి; చక్కటి నెలవున్! 252

ఇది యెద పల్లవించు తతి, యిచ్చటి అందము లెల్ల జూడ - ని
య్యదనున సేదదీరి శ్రమమాఱుచు కొన్నను మేలటంచు స
మ్ముదమున తత్ప్రదేశమును ముందుగ సిద్ధము జేసిరంతలో
నెదురుగ వచ్చి నమ్రత రచించుచు మాన్యులు నిల్చినారటన్. 253

వదనములన్ - బ్రియంబు, సమభావన వెల్లుల గాంచి, ప్రీతిమై
యెద మది యొక్కటై మురియ, నెల్లరి సేమమెఱింగి; పొంగి వా
రిదెస విశేషసక్తి జివురింపగ జేసె రఘూద్వహుండు - వా
రదిగొని కార్యమారసి, యనాగత మాగతమున్ దలంచుచున్. 254



విదితము జేసి రాశయము, వీరిని గాంచుట భాగ్యమంచు, స
మ్మదమెద బూయుచుండ, ముని మాన్యుని మెచ్చుచు దిర్గి పోవగన్,
సదమల వృత్తి యోచనలు సాగెను మువ్వురి మానసంబులం
దదియొక చిత్రమైన దశయయ్యె ననిర్వచనీయ భావనన్ 255

ఎదరొద జేయు పర్వము; మహీతలమే యొక సౌఖ్య పృక్తితో
గదిసిన భావనల్ గలిగె; గన్నులు బూచె; నవేచ్ఛగల్గె; సం
పదలవి పంచభూతముల బ్రాపున జేరె నటన్న భావముల్
గదిలె మనమ్ములన్, సమయ కల్పన నిల్చెను - మెహనమ్ముగన్ 256

పద్దెము శబ్దగౌరవము భావము వర్ణన లౌచితీతతుల్
ఒద్దిక గూర్చుకొన్న విధి, నుజ్వల శోభ జెలంగె రీవితో,
నిద్దపు బచ్చలన్ బ్రకృతి; నేరుపు మీఱగ మెల్లమెల్లగా
సుద్దుల జెప్పుతల్లి మనసున్ దలపించెను - మించె దిగ్ద్యుతుల్! 257

సంధ్య విడచిన లేత కెంజాయ చీరె
ధరణి గంధ మలదికొని మెఱయ - దోచె
నేడు చిత్రవర్ణపు కలనేత యొకటి;
ఆకసము కూర్చె నీలంపుటంచు చెరగు! 258

పటుతర మహస్కర ప్రతాప మవకీర్ణ
మయ్యె; మందరశ్మియె యుపహారమయ్యె
బ్రకృతికి; తటినీజల విస్ఫురణము, మలయ
పవనము గలసి యాహ్లాదపఱచె జనుల! 259

విహగములు గుంపుగట్టుచు వెడలుచుండ
కిలకిలలు శ్రుతి సుభగమై కెలయ; బ్రాంత
మంతయు మనఃప్రియంబయ్యె - నచ్చుగూర్చు
కొన్న కావ్యమది తెఱచుకొన్న పగిది! 260

సుకపు సొగపు తెమ్మెర వీచుచున్న మిత్ర
సేవ; వెచ్చని కర్మసాక్షి కిరణమ్ము
లిచ్చుపోయి - కలగలిసి యెల్ల కడల
శాంతి పండించి యెదల బ్రశాంతపఱచె! 261

కమ్మ తెమ్మెరలిచ్చు వికాసమంది
తరగ లెగయు నాకధుని విధంబు
మనము లుల్లసిల్లు తఱిని-మునికి దోచె
నా పయిని కార్య సంధాన మవసరమ్ము! 262

## బలాతిబల విద్యాప్రదానము

ప్రథిత యశుండు కౌశికుడు బాలుర జేరగబిల్చి నెమ్మదిన్
విదితము జేయ నిట్లనియె; 'బెంపును తేజము నిచ్చు; వాంఛిత
ప్రదమగు శక్తి, నుద్గత తరస్సును గూర్చును, క్షుత్పిపాసలె
య్యదనున గల్లవట్టి మహిమాన్విత విద్య గురించి చెప్పెదన్! 263

సదమల చిత్తవృత్తి, సువచస్సును, శస్త్ర సహిష్ణుతా గుణం
బొదవగ జేయు, యుక్తినిడు, వ్యూహము బన్నగ నిల్పబెట్టు, స
మ్మదము నెడంద నింపుచు శ్రమాదులదల్చెడి మంత్రవిద్య - అ
య్యది 'బల' పేర విశ్రుతము, హార్ద పురస్కృతి దాని నిచ్చెదన్! 264

అదనము దాని తోడుగ సమంచిత విద్య మరొక్కదుండె - న
య్యదియె ప్రశస్తమౌ 'నతిబలా' ఖ్యను, దాని ప్రభావమెప్పు డిం
పొదవ చిరాయురున్నతుల బ్రోచును, కాచు గ్రహీతలన్, మఱిన్
జెదరగ జేయు శాత్రవ విశేషబలంబుల, నట్టహాసమున్ 265

పదనుహరించి, శత్రుల కభద్రత గూర్చు, మనస్సు నిల్వ నీ
య దటులె సాధకుల్ వదలు నాయుధముల్, పరుజిక్కువెట్టి యా
పదలను ద్రోయు, మీకు పస, వన్నెయు జేకురు; సిద్ధమై త్వరన్
గదలుడు, మంత్రవిద్యగొని, కామితముల్ నెరవేర్చుకొండికన్. 266

అదివిని రామలక్ష్మణులు హార్దికమైన కృతజ్ఞతన్ మునీం
ద్రుదిగ ధ్రువీకరించ విదితుల్ గదు మెచ్చిరనంతరమ్ము-స్వా
భ్యుదయము, లోకమంగళము బూనిరి, సంయమి మానసం బనెన్
"బదిలము జేతు మీ భవిత, భాగ్యము, సౌఖ్యము, దైవ వాంఛలన్" 267

నియమోత్సాహము లుప్పతిల్ల శుచులై, నిష్ఠన్, మనఃకాయముల్,
జయవాక్శుద్ధియు, కర్మయున్ - సుగుణరక్ష శ్రేణిగా దాల్చి, స్వ
చ్ఛయయశః కౌముది వోలె నిల్చిరి సువాంఛార్థుల్, సువిద్యార్థులున్
భయభక్తుల్ కయిమోడ్పుగా - తపసి బ్రహ్మత్వమ్ము మున్ముంగిటన్ 268

తారకోత్కరముల్ శుభస్థానమందు
నున్న తత్సమన్వయ సమయోత్సవమున
తన సకల యోగఫలమున తగినపాలు
శ్వాస బూరించి సంధించి సంఘటించి; 269

రామలక్ష్మణు లిరువుర గ్రమము వరల
నొకరి తర్వాత నొకరి గూర్చుండజేసి,
చేత చెయివేసి, తన దరి జేర దీసి
మహిత మంత్రోపదేశము మౌని యొసగె! 270

## తలపోతల లేతలు

అప్పటికప్పటి కక్కడ
నొప్పుల కుప్పలు తెలినెల వొల్లెలు కుప్పల్
తెప్పలుగా తరుశాఖల
తప్పించుచు రాలె నిలను తలపు చినుకులై! 271

ప్రాకట ముని కారుణ్యా
శ్రీకరవృష్టిని కరగిన చిఱుతల భావ
శ్రీకర మాహ్వానించె - ప
దాకార సహస్రము, వివిధాసాద్యములన్! 272

చతుష్పద

1. అంతట రాముడు యాస్వనితమునన్
దాంతియు శాంతి యుదంచిత తపమున్
సంతతమును దన సత్పథముగ - న
త్యంతము నూల్కొని హవణించు మునిన్ 273

2. క్రాంతి నొసంగిన కౌశికునిలిపెను
సంతస మది హరిచందనమయె మే
నంతకు జల్లగ హాయి నొసగె - భా
వాంతరమొక లక్ష్య స్ఫురణముగన్ 274

ఉన్నటులుండి సంయమి అయోధ్యకు వచ్చుట; సర్వలోక సం
పన్నతగోరి సేయు క్రతు భద్రతకై మము వాంఛ సేయుటల్
సన్నని జంకుగొన్న క్షితిజానికి లోకత విప్పి చెప్పుటల్
మన్నన బొందుటల్ - తలప, మంగళభావము ధర్మసూత్రమే! 275

చిత్రములు కనుముందు నిల్చిన విధంబు
గడచిపోయిన ఘటనలు కదిసి కదిసి
గౌరవమును బెంచె; బెంచె నుత్కర్ష మెల్ల
నతిశయముల, సమృద్ధుల నందజేసె! 276

కనుల కభినవ నవభావ కాంతి నొసగె;
హృదయము కృతజ్ఞతా భావ సదనమయ్యె
తండ్రి కోరిక విధృతి పత్రమ్ము కాగ.
తరచి తరచి మనసు పునశ్చరణజేసె 277

తనరాక - పదతతి, తన కోర్కె - అర్థమ్ము,
తన కారణమ్మె - తాత్పర్య గరిమ,
తనయాగ్రహము - ధ్వని, తనధాటి - ప్రౌఢిమ,
తన వివరణ - ఘనతర రసమ్ము,
తన పట్టు- కమనీయ ధారా తరంగిణి,
తన ప్రయుక్తి - గుణ ప్రధానరీతి,
తన శిష్య వత్సలతయె - యలంకారమ్ము,
తన విధము - సమహితత్వ సూక్తి-

కాగ భాషణమ్మదియె వ్యాకరణమేర్చె,
తనదు నౌదార్యము - కథాకథనము గూర్చె;
ప్రాజదువు రసకావ్య సంస్పర్శ జేర్చె,
సతత శుభభావ, సమభావ ప్రతతి బేర్చె! 278

ఎంత కృపా కటాక్షము, మునీశ్వరు కెంతటి కూర్మి ప్రేమముల్?
చెంతకు బిల్చి విద్య దయజేసె నఖండ గతిన్, ప్రయాణ మే
చింతలు లేక సాగి పలుక్షేమ జయమ్ముల గమ్యమేగ - రూ
పించిన శిష్య వత్సలతయే చరితార్థుల జేయు మమ్ములన్ 279

ధర్మజ్ఞులకే తెలియును
మర్మము, యోగ్యతల నెంచి మంత్రద్వయమున్
బేర్మి నొసంగె మహాత్ముడు,
ధర్మి, కుశికనందనుండు తక్కువవాడే! 280

చూపు కూరిమి, వినిపించుచున్న నీతి,
తీర్చు తీఱమి, వెస సమకూర్చు పేర్మి
మాకు లభియించె, నిదియు సామాన్య దుర్ల
భమ్ము గద? పాత్రత గనె మా వంతు మౌని! 281

ఆయెడ లక్ష్మణుండు తన యగ్రజు యోచనలెల్ల యర్థమై,
తీయని భావముల్ తెరలదీయుచు మానస ప్రాంగణమ్ములన్
డాయగ, సంయమీంద్రు కరుణార్ద్ర విశేషము పండువెన్నెలై
కాయగ, సమ్మద స్థితికి కామన సంహతి నారు వోయగన్. 282

ఇట్లనుకొనసాగె - తను బుద్ధీంద్రియముల
నాత్మనిల్పి; దేవముని హితాభిలాషు
లెల్లరిని మది ధ్యానించి, యెల్ల శ్రుతులు
శ్రుతిని వినిపించ; బెనుపగు సుఖము గనగ 283

రామునికిన్ మునికిన్ 'తా
రామైత్రి' కల; దది యాపరానిది; కానీ
ఈ మునిచంద్రుని కింతటి
ప్రేమల్ నాపయి గలుగగ ప్రేరణమేమౌ? 284

క్షణమాత్రమ్ము కలిగె నీ
యనుమానము, దాని వెంట ననిపించె మదిన్-
'ముని చక్షూరాగమ్మది -
కనుకనె కోరని ఫలమ్ము కరముల జేరెన్' 285

ఇది యొక జననాంతర సౌ
హృదలేశము, రఘుకులేశు హేతిగ నేనై
కదలగ దక్కినదీ సం
పద; మౌని యనుగ్రహ మొక భాగ్యంబయ్యెన్. 286

వరుస 'ఋషి' దేవ, ఛందస్సు, వర్ణ, మూర్తి'
గూర్చి వివరించి, నుడికారమేర్చి కూర్చి
మాదు యోగ్యతార్హతల సమయమెంచి
కాదె మంత్రద్వయమ్మిచ్చె గాధిసుతుడు! 287

ఇటు లుదాత్త వాక్కులను సమీక్ష జేయు
చుండ నన్నదమ్ము, లటుసంయమి తలంపు
లందుదాత్త సంఘటనమ్ము లవియు నిలిచె-
నున్న, వైనవి మఱియు కానున్న వెన్నొ! 288



అంతయు దేవ కార్యమని యందరు గూడి వచించి దీని నా
వంతుకుద్రోయ, బూనితిని బాధ్యత, నా హృదయంబు నంద దెం
తెంతయొ చెప్పలేని త్వర, యీప్సితమున్ నెరవేర్చ, తీర్చ; నా
యంతటి ధన్యజీవి మరి యన్యుడు లేదని జాతి మెచ్చగన్. 289

ఒక యాందోళన మొక త్వర,
యొక యాతుర, రాజు - సుతుల నుపయమమై నే
రికి మాటయిడునొ, నిశ్చయ
ప్రకటన జేయనొ యటంచు భయమొందితినేన్ 290

అది యూహింపగ నెంతభాగ్యమొ - అయోధ్యా ధీశుడా పట్టునన్
బదగంగల్ ప్రవహింపజేసె "సుతునుద్వాహంబుమై నిర్ణయం
బది - యింకేమియు జేయలే"దని; నృపుండాకట్టె నా చూపులన్
ద్రిదశాకాంక్షకు నాందియై కథన మందించెన్ జగత్హృష్టికిన్ 291

రాజధర్మము క్రతురక్షణము కనుక
బాలు నంపుమనుట, ప్రథమపంక్తి,
రామునికి గల దర్హత మంత్రవిద్యల
శ్రేణిని గొననంటి, రెండవనుడి,
రాముని సత్యపరాక్రమారూఢి - మా
కు వసిష్ఠ కెఱుకః మూడవ వచనము,
'రావణు దుశ్చర్య రాముడే ఖండించ
నవసరమ్మయ్యె' - నాల్గవ హితోక్తి;

విని, క్రమ క్రమాగత రుష గనియు గనియు,
వాక్య రుచితామృతంపు సేవనము జేసి
చేసి, నా కోర్కె - 'లో' కత జిత్తగించి,
మాట తప్పు సాహసము ప్రమాదమౌట; 292

రాజు సమ్మతించె రాము ననుప నిట్లు -
మించు రుచిని నాల్కమీది యుప్పు
కల్లు చప్పరించు కరణి, సాత్విక చిత్తు
దగుచు-మరియొక పలుకాడలేక! 293

జనకాజ్ఞా బద్ధుడునై
చనుదెంచిన రామమూర్తి సారపు ధర్మం
బన సందేహము లే దిత
డు - నివురులో నున్న నిప్పు, దుల్లని పిడుగున్! 294

తన యంతటి వానికి గురు
వును నేనను భావన మఱువుగ, నవ్యయ బో
ధన లిచ్చెను, నిధిలోకం
బును జూపించె, నిగిడించె బుణ్య స్పృహలన్! 295

లోని చూపుల జూచు యాలోచనమ్ము
నాపెను, ముని - లోకానందుడైన రామ
చంద్రు; మూర్తీభవ ద్భ్రాతృ సౌహృదమ్ము
లక్ష్మణుని - జూడ జూడ, నాహ్లాదమయ్యె! 296

గవుసెనల క్రింది వీణియలవలె దోచె,
చేరి పెరిగిన చక్కని చెఱకు గడల
వలె బరగె, మేను వాల్చిన వారణముల
హవణిక పోలిచె, గోత్రద్వయమన జెలగె! 297

కలత నిదురయును నిదుర కలత గదియ
దపసి మేధను భావికథా కథనపు
గ్రథనము జరుగసాగె, పాల్కడలి పట్టి
యపుడపుడె తన యాస కభ్యాసమిచ్చె! 298

* * *

ప్రభాతము

1. అమృత తరంగిణి యందు చక్రవాతా
ర్ధ మరువకంబది తన్మయ ప్రహర్షో
ద్యమ భరమున్ వలదంచు వేడగాన్ - దా
ద్యుమణియు లేచె కదుష్ణమీయు నెమ్మిన్ ! 299

2. ఉదితము బ్రహ్మముహూర్తమందు మౌని
ప్రథితుడు-బాధ్యత భారమూని, సత్కా
ర్యధృత సహోదరులన్, బలిద్వయంబున్
బదిలుర జూచుచు వాకొనెన్ బ్రతుష్టిన్ 300

కౌసల్య సుప్రజా - కాకుత్స్థ-శ్రీరామ!
పూర్వ సంధ్యోదయ పర్వమెగసె
పైక, కాపోతాది పతగ సమూహమ్ము
వైతాళిక స్తోత్ర పదములొదవె
అర్యముడు శుభకార్యదిదృక్ష గాబోలు
సాగునో పలపల వేగనొకట
దైవకార్యముల కర్తవ్యతరుణమయ్యె
లెమ్ము-నియమితము లిమ్ము లిడును

ధర్మ శీలానురోధ విధానవిధి ప
టిష్ఠ - లక్ష్మణా! సుగుణ గరిష్ఠ - లెమ్ము !
లెందు - భావి మహోదయ లిప్సలవి- నె
ఱి పడగ - బ్రకటస్థిత చిత్త వృత్తులార ! 301

అన, నవోత్సుకతా మలయానిలమ్ము
మలసి యాడుచుండ రఘు వంశ్యు లిరువు రిక
స్నాన సంధ్యాదికము లనుష్ఠానమెల్ల
జేసి మృదుగౌరవాదృతి సిద్ధమైరి! 302

## గమనము-ఘటనానుక్రమము

అరయ, రాగి రేకు నర్ధవృత్తము జేసి
మదచినట్లు కిరణమాలి బింబ
దృశ్యమయ్యె దూర్పు దిక్కవాటమ్మున;
కదలిరి-కవ-మఱియు గాధిపట్టి! 303

ముందడుగు కదల్చ; ముర్మురములపైని
అర్కరూప మంత కంత మారి
త్రిశిర ఫణి ఫణాగ్ర దీప్తి ప్రద్యోతించె
భావి కథకు దోచె భ్రమపంక్తి! 304

నుడికారమ్మును రంగరించి, ముని-నూత్నోత్సాహమింపార, బో
యెదు మార్గంబున యేమి వింతలును యేయే దేశముల్ వచ్చునో
నడుమన్ యే ముని యాశ్రమంబు తమ కానందంబు, శ్రేయంబు గూ
ర్చెదు పట్టో-వివరించుచున్ నడిచె-రాశీభూత విజ్ఞానమై! 305

## తాటకా వృత్తాంతము

పయనించి సరయూ స్రవంతియు గంగ స
రిద్ద్వయ సంగమ క్రీడ జూచి,
దాపున కాముండు దహనమై పోయిన
దేశ మనంగ ప్రదేశము గని,
మరికొంత దవ్వేగి సరయూ ధునిని దాటి
భీకరారణ్య ప్రవేశమెఱిగి,
చనిచని ముందు కచట మలద కరూష
వనముల కథ పూర్వభావి దెలిసి

నేడు తాట కాధీనమై పాడు బడుట,
బ్రతికి చెడిన వాని ముఖ కవళిక తోచు
చెట్టులున్ బుట్టలును, చట్టు గట్టలున్న
పట్టులగుట గని వెఱగు పడెదు తఱిని, 306

మునిజన వాటిక లే తీ
రున పాడయి పోయెనొ యెదురుగ గని, నిట్టూ
ర్పు నిగిడ్చిరి సోదరు, లా
యనయన్ దలపుల నతికెడునంతన్ ... 307

భీకర రూపియున్, గటువు బీరమునిండిన తుచ్ఛ శక్తులన్
సాకు సుకేత పుత్రి, సటసంచిక, నాగ సహస్ర సత్వయున్,
వేకరి పొంతనమ్మునన ప్రీతిని బొందు బలాఢ్య-తాటకా
ఖ్యాకృత ధూర్తురాలు నగు నక్షి యటన్ దిగె భీషణ ధ్వనిన్ 308

ప్రళయ కాలాభ్రఘోర గర్జాధ్వని, విల
యాంత సంక్షుభితాబ్ధి దుర్దాంత ఘోష,
శతసహస్ర కరీంద్ర ఘీంకృతి నినదము
దిక్కటాహ పంక్తులదర బిక్కటిల్లె! 309

అంతట గాధి సూను దనుయాయిని జూచుచు జెప్పె "రామ, నీ
వంతుకు వచ్చె బాధ్యత, యవశ్యము దానిని నిర్వహించు మీ
యింతిని మట్టు బెట్టు మిక - యెట్టెటు జూడక ముందుకేగుమీ
పంతము నెగ్గు నాకు, గరువమ్మును నిల్చును, పొల్చు గీర్తియున్" 310

జగద్ధితము
శ్రీరాఘవ! సుగుణమణీ, చిరజీవి! ప్రజ ముడివైచి సంకట పారా
వారంబున మఱచుచు బెన్‌బరుసన్ బ్రతుకు వశ జంప పార్థివ సద్వ్యా
పారంబని నుడి, యదియే వసుధాధిపువిధియు, నీ ప్రయోగమునన్ లో
కారాధ్యమగు క్రియను జేయగ హంతకి జదుపుమయ్య! సందియమేలా? 311

ధర్మవిరోధ శ్రధన మ
ధర్మమగునె, జననియతము ధర్మము కాదే!
ధర్మాచరణాధీనము
కర్మము - రాజన్యవరుల కర్తవ్యమగున్ 312

స్త్రీ హత్య మహాపాపం
బా హతి నేనెట్లు సేతునని వల దే సం
దేహము, గత చరితమ్ము లు
దాహృతు లీ వేరు బరుక దక్షుడవీవే! 313

స్థిరమగు – 'నగురోర్వాక్య మతిక్రమీత'
మనెడు సూక్తి మఱచి యిల మనగరాదు;
స్థల, ఘటన, నర, కాలోచితమగు కార్య
నిర్వహణ మొక కర్తవ్య పర్వమగును. 314

పృథ్వి
మునీశ్వరు ననుజ్ఞ, తండ్రి హితమున్ బురాయించ, జం
దనాభమగు మందమారుతము తాకినట్లయ్యె, లో
మనంబు గదలించె నొక్క విధి – మంగళాశాసనం
బనంగ రఘురాముకున్; ధనువునందగా బూనుచోన్ 315

రాముని పటు రోషావే
శామర్షానల మహోగ్రశరమా మగువన్
మేమే దాకెను, తాటక
భూమింబడె, గుండెలవియు పురపుర సదులన్ 316

కూలెం గూలెను తాటకాంగన మహాఘోషం బిలన్ రాల, నా
భీలోత్తాల దవాగ్ని గ్రాల, గరి భూ భృత్కోటి ఘూర్ణిల్ల ను
ద్వేల ధ్వానము సంయమీంద్ర గణమున్ దేవాదులన్ మాన్యులన్
త్రైలోక్య ప్రభులన్ గదల్చె; నను సంధానించె శ్రేయోవిధుల్! 317

అమరులు తృప్తిజెంది ముదమారగ దీవెనలిచ్చినారు, వి
శ్వము పరికించె – రామ జయ సాహస కార్యము, కొండసూడుకున్
సమకొనె వాంఛితార్థ మొక చల్లని జల్లుగ, ప్రేమవల్లిగన్,
యమివరు డంత రాముని బ్రియంబున జూచుచు మేలుగోరుచున్; 318

మదిని దలపోయ సాగె – సమ్మతి దలిర్ప
చిన్నదీపంపు వెలుగది యెన్ని యడవు
లనయిన ప్రకాశపరచు, కాదనిన యెంత
యెంత చిచ్చైన పుట్టించి యెగసి తెరలు! 319

అటులె – యుపమించబోలు జ్ఞానాయుధమ్ము,
దాని నందింత్రు గురువు; లద్దాని నందు
శిష్యులును భావసామ్యముంచి మెలగంగ
దిమిర సంహారమే ఫలితమగు నిజము! 320

బాలురకు మనోభావమ్ము పలికె మౌని
మునివచస్సుకు వికసించి వనము గూడ
అపుడె శాప విముక్తయై అడరె ఛవిని;
చైత్రరథ వాటి సాటి వీక్ష్యమగు ధాటి! 321

సదయాంతఃకరణమ్ములో నిలిచె విశ్వామిత్రుడా రాముకున్
బదచిత్రంబుగ దోచినారు రఘురాడ్వంశస్థులా మౌనికిన్
హృదయావిష్కరణంబుగా మిగిలె నా శ్రీరామ గాధేయ బం
ధ దశాధీనత – లక్ష్మణాఖ్యునకు దద్దాక్షిణ్య భావ స్పృహన్. 322

రుచిరము
మనోజ్ఞ భావనల సమన్వయమ్ముతో
వనమ్ము భూరి సుఖము బంచి ధాత్రి భూ
ఘనమ్ము కూఱట నిడగా, వియత్తలం
బు నిక్కె – జుక్క పువుల బూచి యేచుచున్! 323

## దివ్యాస్త్ర ప్రదానము

వేకువరేకవిచ్చు శుభవేళను సంయమి–రామచంద్రు దే
యే కరణీయముల్ సలిపి, యేవిధి దివ్యవరాస్త్ర శస్త్రముల్
జేకొన నౌనొ చెప్పుచు ప్రశిష్యుని దగ్గఱజేర్చి, మూర్ధమున్
దాకి, శుభాశిషంబుల నుదారత నిచ్చుచు నిట్లు వాకొనెన్ 324

అతిలోకంబగు శక్తి గూర్చు నివి దీర్ఘాయుశ్శుభారోగ్య సత్
ప్రతిభాపూర్ణ శతాంశముల్ పుదుకు, ధీప్రజ్ఞాస్థవిష్ఠాది తీ
క్ష్ణత లీ మర్త్యుల కిచ్చు శ్రీ విజయ కాంక్షాధ్యేయముల్ నించు శ
స్త్రతతుల్, దివ్యములస్త్రజాలము – భృశాశ్వాస్థప్రసాదంబులున్ 325

ఘనతరమౌ వరాస్త్రముల గైకొనుమో రఘువంశచంద్ర! నీ
వనితర సాధ్యసంగర మహౌజసముద్భట శౌర్య ధైర్యముల్
బెనుపగు కార్యదీక్షయును వీరవివేకములొందు మీ మహిన్
నినుగని వర్తనా నియమ నిష్ఠల మాన్యులు స్వీకరించుతన్ 326

నత మస్తకుడగుచున్ స్వీ
కృత యాశీశ్శత సహస్ర కిరణుడునై స
న్మతి – శ్రీరాముడు – ముని సూ
నృత వచనము విని, కృతజ్ఞతేచ్ఛ దలిర్పన్. 327

మణిభూషణము
మానుషోర్జమది యల్ప; మమర్త్యుల సాయముల్
మాననీయములు గావుత – మంత్రము లాప్తముల్
మానవాభ్యుదయ సిద్ధికి మాన్యత గోరుచున్
మౌనిధుర్య! తమ యానతి మన్నిక జేసెదన్! 328

"స్వామీ మీకు విధేయతన్ దెలిపి, సత్త్వోన్నత్య సంపన్నతా
స్తోమంబుంగొని, యాయుధోపకరణాస్తోకంబు జ్ఞానంబులన్
మీ మీ బోధలు స్వీకరించ, నట భూమీశుండు సంతృప్తిమై
క్షేమాశీస్సుల నిచ్చు మాకు, తమకున్ జేమోద్చు భక్తి స్పృహన్" 329

అన, నిష్ఠా స్వీకరణన్
మునివరుడా రాముని కరమును చేకొనుచున్
దనకడ గూర్చుండ నునిచి
తనివిని, స్థిరమానసావధానము తోడన్ 330

మొక్కకు నంటుగట్టి, గనుపున్ దగుజాగ్రత జూచి, పాదుకున్
జక్కగ గాల్వ పాయలను సంగడిజేసియు, నీరు వోసి, తా
నెక్కువ తక్కువల్ గలుగ నీయక, గొబ్బరమిచ్చి, పూవులన్
మిక్కిలి యాశజేయు నొక మేటరి కర్షకువోలె – మౌనియున్. 331

తను దా భావించుచు రా
మునికిన్ వివరించె నస్త్రముల–గ్రమమున, పే
రును, దాని తీవ్రత, ప్రయో
గ నియమ, ముపసంహరించు కరణియు బ్రీతిన్ 332

వశ్య పఱచె చక్రవర్గముల; వివిధ
గదల; ధర్మ, వరుణ, కాల పాశ
చయము; నశని యుగము; శర శస్త్ర శూలము
లమర దుర్లభమగు నస్త్రగణము. 333

ఆవాహనము జరిపె ముని –
తావలమునకున్ విధేయతా వ్యాహృతినిన్
భావస్ఫురణార్థము, సం
భావిత దిగ్విజయములుగ మంత్ర వితతికిన్ 334

పరమ విధేయతా విభవ భాసురమై వెలుగొందు మూర్తులా
కరగత విక్రమాబ్ధి కడ గ్రక్కున నిల్చిరి – 'చిత్త' మంచు; మా
పరువము శక్తి వీరము లవార్యముగన్ రిపుదాకు; మీరికన్
గరము బ్రియంబునన్ గదలి కార్యము సర్వము నిర్వహించుడీ! 335

కరమరుదౌ నుదారతను కామితముల్ నెఱవేర్చి కూర్తుమో
యి, రుకుని యాజ్ఞ మేరకు త్రయీతనువంశ పయోధిచంద్ర, ధీ
వర! యిక మీ యనుజ్ఞ యనె – భాస్వర విశ్రుత కామరూపముల్
స్వరసుధ నుల్లసిల్ల దమ భావము, నైజము, మాటతీరునున్ 336

శ్రీరాముని ముందక్షర
పారావత పంక్తివోలె బ్రకటించిరి, సా
కార భృశాశ్వ తనూభవ
ధీరులు; వారిని గని రఘుధీరుం డనియెన్ 337

దూసిన చుక్కమల్లియలు దోసిలి నిండుగ బోసినట్లుగన్
నేసిన రంగుదారము లనేకము నొక్క విచిత్ర వర్ణమై
భాసిలి వస్త్రరూపమున వక్షముపైబడి హాయిగూర్చె నాన్
జేసిన పుణ్యసారమది జీవఫలంబయి దక్కినట్లుగన్. 338

మామక ధన్యతాప్తియును, మౌని కృపార్ద్రత రెండు నేకమై
ఆముఖమందె నాకు నిటు లత్యధికమ్ము-ఫలమ్ము, భద్రతా
స్తోమము జేరె-మీ కలన చోదక శక్తియుగూరె, గుప్పిటన్
సోమము జిక్కె; దివ్య వరశోభయు గల్గెను మాన్యసేవకున్. 339

'ప్రస్తుతము మీకు సెలవు' పలుక రామ
భద్రు దనఘులు 'చిత్తము, భవదను గ్ర
హమ్ము' వచియించుచు నదృశ్యులైరి వారు -
కుశికసుతు చూపుతరగల కుతకమెగసె! 340

అత్తఱి రామచంద్రుడు నయంబున సంయమిచంద్రుతో ననెన్
'జిత్తము బల్లవించె, హృదిసీమ బ్రశాంతత నిండె; నాదు హృ
ద్వృత్తము దామెఱుంగుదురు ధీవర! నేను సుమిత్ర పట్టి కీ
విత్తము - నేను నేర్చినది-ప్రీతిని జెప్పెద సమ్మతింపుడీ!' 341

అదివిని కౌశికుండు కనులందున సంప్రియ మోద బాష్ప తో
య దళమునిండి నిల్వ సమయాన్విత వాంఛ నతి ప్రశాంతతన్
విదితము జేసి నట్టి రఘువీరుని దా మది మెచ్చి, కీర్తి సం
పదగొను సోదరాప్తి కిది పాదుగ భావనజేసి యిట్లనెన్. 342

శక్తికి మూలము శాంతము
శక్తికి మూలము కరుణయు, సౌభ్రాత్రములున్
శక్తికి మూలము ప్రేమము
శక్తికి మూలము సదమల సంభాషణమున్ 343

శక్తియ వజ్ర హృదయమగు
శక్తి ప్రసూన మృదుమానసము, వాఙ్మయమున్
శక్తియ సదాశయంబగు
శక్తి సరస్వంతి! యసదృశము నీ భాషల్! 344

రామునికి దగు మాటలు రాముడె పలు
కాడ గల, దమందానంద మందె మనము,
నీ కభీష్ట సిద్ధి కలుగుగాక - యన్న
దమ్ము లమిత తేజస్వులై - ధరణి వెలుగ! 345

అనినన్ రాముడు లక్ష్మణున్ గనుచు మధ్యాహ్నార్కతేజంబుతో
మునికారుణ్యవిశేషలబ్ధ శరముల్, ముఖ్యాస్త్ర సంఘాతముల్
జనితేచ్ఛాగత మోద నాదములతో సంజ్ఞాపనన్ జేసె, ల
క్ష్మణుడున్ సోదర సూచితాభ్యుదయమున్ సహ్యంబుగా గైకొనెన్ 346

మరునాడే పయనమ్ము: ముప్వురును సామంజస్య మేపార స
త్వర కార్యక్రమ మాపయిన్ వలయు సంబారంబులన్ గూర్చి చే
సిరి యాలోచన, తీరుతెన్ను కనిపించెన్, యజ్ఞరక్షావిధుల్
సరియయ్యెన్ : తెరదించ, దేహములు విశ్రాంతిన్ సమర్థించెడిన్ 347

## విశ్వామిత్రనిజాశ్రమ ప్రవేశము

కదలెదు పిల్లగాలి మృదుకాకలియున్ దమ తోడు జోడుగా
గదలగ-ముప్వురున్ జనిరి, కానన సీమను దాటిదాటి, సొం
పొదవు ప్రశాంత సుందర తపోవన మొక్కటి జేరి నిల్వగా
నెదనొక హ్లాదవర్ణతతి యేర్పడ, రాముడు మౌని కిట్లనెన్. 348

పచ్చని గడ్డిలో బడిన వహ్నికణంబుల వోలె వీటికల్
అచ్చులు కూర్చుకొన్న కరుణాచల సానువులట్లు వాటికల్
విచ్చియు విచ్చునట్లు గనువిందిడు తీవెల పుష్ప చేటికల్
అచ్చపు నీరు గాన్కనిడ హాళిని సాల్వడు నేటి యూటలున్. 349

ఏమి మనికి? ఇది యే యా
రామం బేయాశ్రమ మిది? ప్రాకామ్యముకై
కైమోడ్చు స్థితప్రజ్ఞుని
మోమువలె-నెలవు-ప్రసన్నముగ శోభించున్! 350

అనవుడు మౌని - దాశరథి, నాతని తమ్ముని జూచి యిట్లనెన్
'గనుడు మనోజ్ఞ మాశ్రమము, కశ్యపమౌని తపఃఫలంబు నం
దె-నిచట; సిద్ధనామమున దీని ప్రసిద్ధికి సంతసించు వా
రనిశము మౌని సన్నుయమటన్నది సూనృత భాగ్యమై చనున్ 351

దనుజవిరోధి తా బలి వధమ్మొనరించిన పుణ్యభూమి, దీ
నిని మునులెల్ల నా యభిదనే గమనించెద, రెల్ల గాధినం
దనుడన వారికింగల యుదార గుణ ప్రచురంబు; డంబు; మీ
రనదగు - వామ నాశ్రమ మటంచునె, నా మది తృప్తి జెందగన్. 352

ఆ రీతి, కశ్యప వషట్
కారులు మఱి బలి తమ శుభకామన లిచటన్
బేరిమి బండించుకొనిన
కారణమున సిద్ధవనముగన్ బేరొందెన్ 353

అని దీర్ఘంబుగ బల్కి గౌశికుడు, సత్యాలాప సంతుష్టిగన్
వినుచున్, గాంచుచు బాలకద్వయ మెదో ప్రేమంబు మైదాక, భ
క్తి నితాంత శ్రవణోత్సుకత్వ నిరతిన్ గేల్మోడ్చి-హర్షాబ్ధిలో
మునుగన్ దేలుచు నుండు వారల గనెన్; మోదాబ్ధి దా మున్గుచున్ 354



వెనువెంటన్ గుశికాత్మజుండు తన సర్వేష్టాప్తి సూచించుచున్
దన యాగంబట నిర్వహించవలె, నంతర్మోద సందోహముల్
ముని బృందంబుల వాంఛ లివ్వియనుచున్ బోధించుచున్నంతలో
నెనరుంజేతల రండు రండనగ రానేవచ్చిరా సంయముల్ 355

"గనువిందౌ జత, యొక్కటై పెరిగి యాకారంబులో భావ భా
వనలన్ తేజస రాజసమ్ముల ఛవిన్ వర్ణించుచున్నట్టి రెం
డనటుల్ బిల్కలు వీరువీరని యమేయానంద చేతస్కులై
కని రా మౌనులు శ్రేయముల్ బలికి సంస్కారమ్ము శోభిల్లగన్ 356

ఘన సౌహార్దము భావుకమ్మెనయ సంకల్పంబుగా నిండు దీ
వనలన్ 'దిగ్విజయోస్తు' 'మంగళము మీవంతౌత' 'వర్ధిల్లుడీ'
యని వేవేలుగ వారి యాగమము నాహ్వానించుచున్నంతలోన్
మునిముఖ్యుండు 'తథాస్తు'తో తఱికి సంపూర్ణత్వమున్ దానిడెన్ 357

## యాగసంరక్షణము

అనియెన్ రాముడు, మౌని దిక్కయి, 'మహాత్మా! తీరుబుణ్యంబు; ధ
ర్మనిధానమ్ముగ దేవపూజ, సవనారంభంబు గావించి - మీ
మనమందున్నది సర్వమున్ జరిగి సమ్మాన్యత్వమున్ జెంద, నీ
వనమందున్నది సర్వమున్ బరగ సంభావ్యాప్తి నందించుడీ! 358

అంతియకాదు మౌనివరులార! యికన్ సుఖముండి యజ్ఞ మా
సాంతము నిర్వహించుకొన సాగుడు, రాక్షస దుష్టచర్యలన్
జెంతకు జేరనీయ కిక జేతుము సిద్ధవనంబు సర్వమున్
శాంత సదస్సుగన్, నిలుచు సార్థక నామము సిద్ధవాటికిన్ 359

అనగన్ వారి సమర్థతన్ దెలిసి యాహ్లాదించి గాధేయుడా
య్యన నాశీస్సుల నిచ్చి తాను తగు సంఖ్యా సంజ్ఞ సంకేతముల్
ముని బృందమ్ములకిచ్చి యాగ విధులన్ మున్గంగ, సిద్ధాశ్రమం
బున హోమంబులు మంత్రముల్ కలిసి దిగ్భూమిన్ ప్రవర్తించగన్ 360

అతిశ్రద్ధన్ ముని ముఖ్యులా సమయమం దాచార యోగ్యంబు లౌ
క్రతువుల్, కర్మల శాస్త్ర సమ్మతముగన్ గావించి, రారంభమున్
బ్రతిభా పూర్ణమహత్వమున్ నెఱప, గీర్వాణ ప్రతిధ్వానముల్
శ్రుతి సంయుక్త నినాదముల్ జెలగె సుశ్లోకత్వ సంరంభమై 361

ఉద్దామంబుగ వర్తిలెన్ మఖము, ధర్మోద్భూత సంకల్ప మే
సద్దుల్ లేక విపాతముల్ గొనక, రక్షాదీక్ష కర్తవ్య ల
క్ష్యోద్దండంబు ధరించి రాఘవులు సాస్త్రుల్ నిల్వగా నైదు రే
ప్రొద్దుల్ బోన్ మరునాడు రాక్షసుల దుర్వ్యూహమ్ము పైపై బడెన్ 362

సునిశితమౌ పరిశీలన
మొన దేఱిన ధీకుశలత మునుమిడి వెడలన్,
గనుగొని మాయాజాలము
ననుజునకున్ హెచ్చరికల ననె నగ్రజుడున్, 363

కదనాంతరమున లక్ష్మణు
'డదిగో – అన్నా – అది కను – మహహో– పగవా
రదరులుగ నెగసి తూపుల
నదరున నదవదల మాడి' రని కేరించన్ 364

ప్రేమాస్పదమును గంభీ
రామోదము గలసిన యమృతాద్యుతి దనిపెన్
రామకటాక్షము – తమ్ముని;
సామప్రకృతికి దదన్య సామ్యము తగునే! 365

గ్రన్నన జెప్పె దమ్మునకు రాముడు–లక్ష్మణ! చూడు మాగ్రకడన్
బన్నుగడల్, పనుల్–రుధిరభాండము లెత్తిరి రక్కసీంద్రు, వి
ఛిన్నత పండునే – మొఱగు జెండుము, మానిసిదిండి తండమున్
ఛిన్నమొనర్చి త్రెక్కొనుము ఛిత్వర పర్వపు సర్వగర్వమున్ 366

'మబ్బుల పిండుదాగి మదమత్తులు, ధూర్తులు, దుష్టచిత్తులున్
గొబ్బున తొంగిచూచి పలుకుండల వంచుచు రక్తమాంసముల్,
దబ్బఱ చర్యలన్ జరుప దాగుడుమూతల నాడుచుండ్రి, ఆ
దెబ్బకు దెబ్బ తీయవలదే, యిక సిద్ధముగమ్ము లక్ష్మణా!' 367

అన్నంతన్ గుణవర్తనుండు మతి వీర్యాభిజ్ఞుడా లక్ష్మణుం
డన్నన్ బ్రేమ నిధానమున్ బగిది వేడ్కన్ జూచుచున్నంతలో
విన్నున్ మన్నును దాకుచున్ దనుజు లాభీలోద్ధతిన్ దాకి రా
మున్నీరుల్ బడు రీతి మాయగొని, పెన్మ్రోతల్ వెలారించుచున్ 368

పగల బడుచు – మారీచ సుబాహు లపుడ
హంకృతుల వెడల, రఘూద్వహద్వయ మ్మొ
కటిగ – వరుణ సహస్రమ్ము కదలురీతి
మోహరించి, శరాహతి ముంచినారు! 369

ఎదుటివారల పోతర ముదుటు దనదు
నీఱపు గడిమి గసరున నీసుజేసి
వరుసతేరుకాని కొడుకు బిరుసుమీఱ
మనిసి తూపు మడపుజేసె – మంచి నెంచి! 370

రామ శౌర్యాగ్ని శలభమై రాలె–పుణ్య
జనుడు – మారీచ ఏనస్వి, జల్లికాడు;
ప్రమితి సంపూర్ణమయ్యె శిరమ్మది శత
యోజనాయస్తముగ క్షిప్త యుక్తమయ్యె! 371

ఖరు సుబాహు దురాగత గ్రాసరాశి
రాము తీవ్రానలాస్త్ర దుర్దాంతకీల
భస్మమొనరించె, దలద్రుంచె, వాని చరిత
ముగియజేసె, ఖచర వర్గముల్ గొదవడె! 372

ప్రాప్త మాగామి కర్మ; ప్రారబ్ధ ఫలము
రీతి; అనుభవమ్మగుత - మారీచు నబ్ధి
ముంచె - ధృతకీర్తి రఘురామమూర్తి; స్వయము
గా సుబాహుండు సంచిత కర్మధుర్యు
డగుత వాని చాగఅలాడె - న్యాయమేర్చ! 373

ఆపయి సుమిత్రసూతి వాయవ్యమొగిని
యసుర విసరపు శిరముల గసిమెసంగ;
బ్రకటితంబయ్యె రఘుకుమార ప్రతాప
గరిమ; దివిజ, ద్విజ, ప్రజ - క్రాంతి దనరె! 374

స్వాంతాధ్యాయి మునీంద్రు డాయెద దలంచన్సాగె, 'నోరామ! నీ
యాంతర్యం బహహో! మహార్ణవమునన్ హత్తించి మారీచు; నా
సాంతం బీ వ్యధ గుర్తుగా నిలుచు ధ్యాసన్, దాటకావర్జనం
బెంతెంతన్ మది గుందజేయవలెనం చీరీతి భావించితే?! 375

అలరన్ దానై విత్తిన
బల మీ రీతిని ఫలించి వర్ధిలు వేళన్
బలియని జంట నిటుల గురు
వలఘుస్వాదు వచనామృతాబ్ధిని ముంచెన్. 376

రామా నాకిది సంబరమ్మొ, సుఖమో, రాగమ్మొ, యే భాగ్యమో-
యేమందున్ బ్రతిభా పరాక్రమము లీవేయౌచు నా బాధ్యతన్
సామర్థ్యంబు రహించ దీర్చితివి; విశ్వామిత్రుగా - నీకు నే
క్షేమంబీయగలాడ; నందుము శుభాశీస్సంప్రదానమ్ములన్! 377

అన్నకుదగ్గ తమ్ముడవయా యనురక్తియు భక్తి శక్తి సం
పన్నత జూపి లక్ష్మణ! సమాన ఘృణిన్, బరిపంథి గర్వమున్
ఛిన్న మొనర్చి, వీక నుసిజేసిన నీ పటు ధైర్య శౌర్యముల్
కన్నుల పండువయ్యె, శుభకామనగొమ్ము చిరాయురున్నతిన్ 378



దిటవౌ దీవెన స్వీకరించుచు గృతార్థీభూతచేతస్కులై
నిటలాక్ష ప్రభలన్ వెలుంగుచు సురానీకమ్ము బ్రార్థించి, మి
క్కుటమౌ భక్తిని మౌనికిన్ నతుల చక్షుః ప్రీతి గావించి, మీ
దటి కార్యంబును చిత్తగింపుడనిరా దక్షుల్ ప్రజారక్షకుల్ 379

జంటవింటి గడల వోలె నున్న - రామ
లక్ష్మణ సహోదరుల గాంచ, లక్ష్య లక్ష
ణ ప్రతిఫలనాన్వీక్ష ఘనమయి నిల్చె
గాధిపట్టి సౌజన్య సంకలనమందు! 380

ఒక సంతృప్తికి జీవమున్ నెఱపి సద్యోగ ప్రసాదమ్మునున్
సకలస్తుత్యము జేసినారు - ఘనశిష్యాభిఖ్యకున్, నాకు, గౌ
శిక సౌరభ్యము నింపిరీ ద్వయము - రాశీభూత చైతన్య వ్యం
జకమై, చేత గమండలోదకముగా సాధించి రభ్యున్నతిన్ 381

తడిసిన కన్నులందొక హ్లాదద్యుతి దీధితి వన్నె మీఱగా
నుదులవి వాతెఱల్ వదల నోవుచు నుండగ మౌని బృందముల్
వడివడి వచ్చి వీరలకు వందన సత్క్రియ లాచరించి నా
రెడదల సాదువాదముల నేర్పడ జేసి శుభోత్తరంబుగన్ 382

మనసుల గదలిచిన హిత వ
చనములు కదలెన్ సుఖప్రసంగములందున్;
దనరగ దాశరథులు మఱి
మునులందరు చిత్తగించ మునిముఖ్యుడనెన్ 383

ఈలీలన్ గ్రతువంతయున్ ముగిసె; నా శిష్యతేజఃప్రభల్
శ్రీలన్ జిందె; బ్రశాంతతను బంచెన్; 'సిద్ధి' జేకూర్చె; దీ
క్షా లక్ష్యమ్ము ఘటిల్ల జేసె, ముని సంఘాతంబు కీ వాటి కు
ద్వేల స్ఫూర్తి దలిర్చె; నాదుమది బ్రీతి స్ఫీతమున్ బర్వెడిన్ 384

## మిథిలా ప్రస్థానారంభము

కృతమతు లెల్లవారికి బ్రకీర్ణ కృతజ్ఞత లందజేసి, సా
గు తతి వచించిరా మునులు కుల్యుడు, విశ్రుతు డా విదేహభూ
పతి తమ రాకకై తనదు వాంఛితమున్ వెలిబుచ్చె; ధర్మ స
మ్మతమగు యజ్ఞ పర్వణికి, మన్నన జేయుడు సాగరండికన్. 385

రామా మీరును మాతో
నా మిథిలకు రాదగు, నట నాభీలంబున్,
ధామ ప్రభావిరాజిత
మౌ మహిత ధనువు గననగు, నగు మంగళముల్! 386

అన, వనదేవతలందరి
కిని నుతులిడి ముని తన మనికిని సిద్ధార్థం
గను జేసిన సిద్ధాశ్రమ
మునకు బ్రదక్షిణము జేసి ముందుకు గదలెన్ 387

ప్రణుత మతి కౌశికుడు, ముని
గణ ముఖ్యులు, వారితోడ గార్ముక ధరులై
రణవిజయులు – రాముడు, ల
క్ష్మణుడున్ జని రుత్తర దిశ, మార్గము పిలువన్ 388

చని, సాయంతనమైన క
తన నాగిరి శోణభద్ర తటమున వారున్,
ముని విశ్రాంతిని గొను తతి
వనము గురించిన కథ నొడువగ నడిగి రొగిన్ 389

సత్సంయమి వరు దత్తతి
వాత్సల్యము గదుర దనదు వంశక్రమమున్
సత్సంగతిగా నుడివెన్
వత్సల కిద్దరికి, నంత బక్షిణి కదలెన్ 390

సాంద్ర పరితోష వైభవ
చంద్రులగుచు రాట్సుతులు – కుశాన్వయమునకున్
జాంద్రీమయ యశమిడి – ధ
ర్మేంద్రులయిన బూర్వజుల సమీక్షించి రొగిన్ 391

అసమాన ధర్మి కుశనృపు
డసదృశ సూనుడు కుశాంబు, డమలుడు కుశనా
భ సుగుణ నిధియున్ ధూర్త ర
జసు దనఘుడు వసువు – మది మసలె రామునికిన్ 392

అనఘుల్ గౌరవనీయులన్ దలచి, కన్యాకుబ్జ వృత్తాంతమున్
దనివారం గుశనాభు నిష్టికథయున్, దత్సూనుడీ కౌశికున్
ఘనచారిత్రము, గౌశికీ శ్రుతియు శ్లాఘ్యంబంచు గీర్తించి, పా
వన భావంబుల దంతి దంతముల శేవన్ నిల్పి రాపూర్తితోన్! 393

దిగుడు బావికి పోయి, లోదిగి సరగున
నీరు తెచ్చుకొనిన భంగి, నిక్కమైన
పెద్దవృత్తమ్ము దడవిన విధము నయ్యె
ననుచు మురిసిరి భానువంశ్యద్వయమ్ము. 394

అక్షయ పుణ్యంబగు నీ
యక్షరతతి 'లోకత' గొనె నా రాఘవుడి
ట్లు, క్షమయె దానము, యజ్ఞము
ను క్షమయె, క్షమయే యశమును, నుడుగున్, మఱియున్ 395

అక్షర మాచరణీయము
దక్షతయే విధి విధాన తత్త్వము నిడు, ని
ష్పక్షము క్షమ, ధర్మంబగు
ను.... క్షమయె త్రైలోక్యనుత మనుపమ ధృతియనన్ 396

మది నిక్షిప్తము జేయుచు,
సదమల భావప్రసంగ సాహిత్యములన్ -
బదిలము జేయుచు; మేథను,
హృదిని; రఘూద్వహుడిక నిదురించ గడంగన్ 397

చంద్రాస్యుండగు రాము మానసము విశ్రాంతస్థితిన్ జేరమిన్
జంద్రాలోక విలోక సంభవ విశేషప్రీతి సంరూఢమై
సాంద్రారణ్య తరుప్రవృద్ధ పృషదశ్వ ద్వీచి సంసేవ్యమై
చంద్రార్కాన్వయ పుణ్యమూర్తి గణ సంస్పందంబునై గ్రాలెడిన్! 398

వినుకలి చేతనే యిటుల వీనులు విందులు బొందె; గౌశికున్
వెనుకటి పుణ్యమూర్తుల సవిస్తర దర్శనమేను జేసి వ
త్తునని ప్రభాకరుండరిగె దొందర తొందర మీర; రాత్రికిన్
బనిపడె; లోకజీవనపువాస విధానము మారె; మీదటన్- 399

* * *

## 'ఆకాశంబున నుండి' .... గంగావతరణము

రేపకడ లేచి దేవకార్యోపదిష్ట
విధుల నాచరించి మునులవెంట సాగి
సాగి, బహుదూరయానమ్ము సలిపి సలిపి,
జాహ్నవీ తీరమును జేరు సమయమందు; 400

గుప్పెడు గుప్పెడై, కలువగొంగని మాపటివేళనిగ్గు లా
యొప్పులకుప్ప మిన్నుకొలకూయలలూపుచు దాకుచుండె, సొం
పొప్పగ తూడుదిండిగుమి, నుయ్యలజిట్ట గమిన్, బరాచికం
బొప్పును నెయ్యమందు, విరియున్ గిలిగింతలు మోజులూరగన్ 401



ఉత్సాహ
పుణ్యుడు రఘువరుడు - గంగ, బూత చరిత గాంచి - కా
రుణ్యధునిని మునిని గోరె 'రూఢి దెలిపిన తమ రీ
గణ్య త్రిపథ - ఇల వెలసిన క్రమము నుడువు దనగ నా
పుణ్యగాథ వినిచె నా తపోధనుండు నీ వహిన్ 402

ఒక్కటే యోచన యూహానిలమ్ముగా
సగరరాట్పతి నూపి కలచియాడె
నొక్కటే యత్నమ్ము ద్యోతిత జ్యోతిగా
నంశుమంతుని చేతికందయయ్యె
నొక్కటే లక్ష్యమ్ము స్యూతి శీర్షకముగా
ధర్మజ్ఞుడు దిలీపు దలకు నెక్కె
నొక్కటే నిర్ణయ ముపకార్య కేతువై
ఘనభగీరథు వృద్ధి గై గదల్చె
నదియె గంగావతరణమ్ము - వదలలేక
తరతరముల వారి సాధనము కాగ
ప్రతిన కదలి, కడకు భగీరథు దపమ్ము
కడకు జేరె నిత్తఱిని - దిక్తటము లదర! 403

గోకర్ణంబున నూర్ధ్వబాహుడయి చిక్కుల్ ద్రొక్కటల్ నెట్టి-తా
క్ష్మాకాంతుండు భగీరథుండదరె వీకన్ బెక్కు కార్లా సురా
నీకంబుల్ కెరలన్ నిర్భర తపోనిష్ఠా ప్రతిజ్ఞాదృతిన్
సాకల్యైక మహాభికాంక్ష జరిపెన్ సప్తాత్ముడే యౌననన్ 404

తత్తపః ప్రసక్తియు బ్రథయు విని బ్రహ్మ
తానె ప్రత్యక్షమయ్యె భూధవుని ముందు,
వరము గోరుము ధర్మ సంవరణ మేర్చ
నంచు గరుణ సకలము సేవ్యమ్ము జేసె! 405

అంత భగీరథుండు వినయావనతుండయి బ్రహ్మ వేడె నీ
యంతటి తాత వేల్పు కరుణాత్మ నను(గహ మర్కవంశ వి
(క్రాంతికి పాలకూడగు, సుఖప్రచురామృత ధారలన్ నిరా
తంకము పంచుగాత ప్రపితామహ షష్టిసహస్ర మంతయున్. 406

మధ్యాక్కర
శాశ్వత స్వర్గలోకగతి సంపద బొందును గాక,
విశ్వస్తుత మహత్వ పూర్ణ వేగిని గగన స్రవంతి –
శశ్వత్కృపామతల్లి యయి జగముల దేలించు గాక,
విశ్వజనీనమై వెలిగి విశ్వసితంబగు గాక! 407

అని క్షణమాగకుండ బలుకాడె భగీరథ పుణ్యశాలి యో
ఘన వనజోద్భవా – అది యొకండు వరమ్ము, మఱొక్క కోర్కి – మా
దినకవర వంశ మెన్నడు క్షతిం గనరాదు, జగత్ప్రసిద్ధులౌ
ఘనుల పరంపరాగతము గావలె, రెంటి ననుగ్రహింపుమీ 408

అన, పలుకువెలది పెనిమిటి
తన నలుమొగముల – పొలుపు పొదలిక కదల – దా
ననె – 'నదియగుగాక' పిదప –
వినుజాలు నడకల తనకలి వితములు తెలియన్. 409

సంతసముప్పతిల్ల వికసన్ముఖపద్మము తోడ నిల్చు భూ
కాంతునితో వచించె విధి – గంగ వహింప సమర్థుడొక్క కా
లాంతకుడో భగీరథ – అన్యుల కసాధ్యము; భూమి యా సర
స్వంతము సూటిగా సయిపజాలదు – కావున వేడు మీశ్వరున్. 410

మేఘదీపలలంతిక మెఱసె నభము
నాపని బడతువా – ఓరి – నాయన! యని;
మదిని నెక్కొన్న ఆశారుచి దృశి నిట్లు
దా వెలార్చె భగీరథ ధరణిజాని! 411

స్వామీ – గంగను తెచ్చుకొందును; భవత్సౌజన్యకారుణ్యముల్
నా మార్గంబున జేతి దివ్వెలు; జగన్మాంగల్య సంధాత యౌ
వామార్ధార్యు నుతింతు; నొక్క వరమున్ ప్రార్థింతు, మెప్పింతు – నం
చా మీదన్ బరమేష్ఠి యేగె దివి; సాధ్యానీక సంయుక్తుడై 412

భువిని ముందుగావేడి శంభుని స్తుతించె
నా భగీరథ క్షితిపతి; యమర ధునిని
దాల్చి నన్ను, మావారిని ధన్యతముల
జేయు మంచెడదదొగవు జేసి నిలిచె. 413

మధ్యాక్కర
ప్రాపున జేరిన ధర్మబాంధవు గోర్కెయుక్తమని
యా పినాకి యనుగ్రహించి – నాశ్రవమిచ్చె – దానె అమ
రాపగ – శైలరాజసుత నంది, శిరమున ధరింతు
నంచు, జగత్రయ మొంద నస్తోక ధన్యతాగరిమ! 414

పరిపూర్ణోజ్జ్వల ధాళధళ్య లహరీ బాహుళ్య శోభాంగియై
వరవిన్యాస విలాసినీ గమన సౌభాగ్యాపితాసంగియై
స్ఫురితోత్తుంగ తరంగ భృంగవిదితాభోగప్రగీతాంగియై
వరగంగాఝురి – ధీరయై – కదలె నూర్ధ్వద్వారమున్ వీడుచున్ 415

మధ్యాక్కరలు:(3)
పొంగింది పొంగింది గంగ, పొంగి ఉప్పొంగింది గంగ,
సంగీర్ణ హంకార గర్వ సంకీర్ణ చక్రాంతరంగ –
పొంగింది పొంగింది గంగ, పొంగి ఉప్పొంగింది గంగ,
భృంగీశు నాదు వెల్లికల పెనచి జేర్తు బలి గృహమని! 416

పొంగగా పొంగగా గంగ, పొంగి ఉప్పొంగగా – నెంచి
పుంగవకేతువా గంగ, పొంగు నాపంగ నిష్ఠించె!
రంగైన తన జటాగహ్వరమ్మున బంధించె – నొంచె,
గంగ యాడెను శివు పుణ్యగహనమూర్ధన్య విపంచి! 417

తిరిగింది తిరిగింది గంగ, తిరిగి క్షోభించింది గంగ
దరిలేక దరిలేక గంగ, దారియే కనరాక గంగ,
తరచింది తరచింది గంగ, తరచి యాక్రోశియై గంగ
మరగింది మరగింది గంగ, మరగి యోచించింది గంగ, 418

అంత దీనయై, దర్పఘ్నయై సురనది
హర జటాజూటమున జిక్కి యార్తిజెందె,
గుందె; బెక్కేండ్లు గడచె; వ్యగ్రుండు, రాజ
చంద్రుడు భగీరథుడు - ధార్తచంద్రు వేడె. 419

'భక్తవత్సలా - విడుము స్వర్వ్యాప్తి - 'గంగ
విడుము, పార్వతి చాలన్న పిలుపు వినము,
కొనుము గంగాధరుండన్న క్రొత్త బిరుదు,
నెత్తఱులు కొన్ని విడుము మాకిత్తఱి శివ! 420

అను - తపోగరిష్ఠంబు భక్త్యాభిమతము -
గార్య సిద్ధిని పొనరించె - ఖరువు; గంగ
దొఱగె - బ్రహ్మనిర్మిత బిందుసరసియందు;
చరిత - జయకరమ్మును, యశస్కరముగాగ! 421

వేగవతి
పెరిమిన్ హిమజాప్రియుకున్ దా
సారవిచార వశంవదరీతిన్
పరికీర్తనముల్, పరిభాషల్
శ్రీరుచి ధారల సేవల నిచ్చెన్ 422

వేగవతి
పెరిమిన్ గొనుచున్ విలసత్‌రే
ఖా రమణీయముగా నెగసెన్ - దే
వర దీర్ఘిక - సప్తవిధాదే
యా రయహార విహార విభక్తిన్ 423



రాజమరాళ
నళిని, పావని హ్లాదినీ
కళలు ప్రాగ్దిశ సాగగన్
కళుకు నిక్కుల 'సీత' యున్
వళుకు సోకుల సింధువున్; 424

రాజమరాళ
దళితమైన సుచక్షువున్
దళుకు వెల్లువ దా వళా
వళిని సాగె బ్రతీచికిన్;
గెళవుగా దిగువాఱుచున్- 425

వెలుగుల వేడ్క నేడవ ప్రవృత్తి భగీరథు వెంట భూమిపై
వెలువడసాగె; దజ్జలము విశ్వజనీనము విస్తృతంబునై -
పిలిచిన పేరటంబునకు వేళము వచ్చెడు పెద్ద ఐదువం
బలె మనసుల్ కదల్చె - గనువారల ముచ్చట తొంగలించగన్. 426

తీవ్రశబ్ద పురస్కృత, ధీరగమన,
శుభద, సౌఖ్యద, పుణ్యద, శుభ్ర - గంగ
భూప్రవేశము మంగళ ప్రోహమయ్యె
దేవ- గంధర్వ - ఋషి - యక్ష- దిగ్భ్రమముగ! 427

సరస సంగీత సాహిత్య సత్కథా ప్ర
సంగయుక్త కావ్యేతిహాస సమసనము;
రసభరిత పదచిత్ర పత్రాసనమ్ము
పరమ పావన గంగావతరణ ఘటన! 428

పుణ్యజనామృతేప్సితము భూమికి జేరె - గంగ - ప్రా
వీణ్య సమాశ్రితా సరము వెంబడి బోవుచు దారి మధ్యలో
గణ్యుడు జహ్నుమౌని హవకార్య నివేశము ముంచివేసె; కా
ర్పణ్యము వీడి సంయమి సురాపగ నద్భుతరీతి ద్రాగగన్ 429

సంకటమయ్యె - రుద్ర హరి సారసగర్భ సుపర్వ ముఖ్యు లా
వంక - భగీరథుండు మునివర్గము జహ్నుమహర్షి మ్రోల'నో
పంకవిదూర! తాపస! కృపాభరితాత్మక! గంగ చెయ్దు మా
తంక మొనర్చె మీ క్రతువిధానము; దప్పును సైచి కావుడీ!' 430

అని, మహర్షి బూజించి 'మహాత్మ - ఈ ద్యు
ధునిని క్షమియించి, భవదీయ దుహిత యనుచు
నాదరించి విడు'మనుచు నభినుతించ
గినుక దేఱిన శాంత దర్శనము నిచ్చి- 431

సుధారసలహరి
తాపసేంద్రుడు ప్రముది తుం
డై పునః సృజన సలిపెన్
దా పురందరను నిజ క
ర్ణా పితమ్ము - ధర నిలువన్! 432

జహ్నుసుతయు జాహ్నవియు లక్ష్మణములయ్యె
గంగ కానాటి నుండి, సంక్రమణ మేర్చె
బిదప - వార్ధి సంగతము సంప్రీతి నెఱపి,
లక్ష్య సంపూర్తికై అధోలంబ మేగె. 433

ఉత్తమ గంగా సలిలం
బుత్తాలోదీర్ణ పుణ్య యోగ్యత నిడగన్
ముత్తిని గొన నరిగిరి స
ద్వృత్తమొసగి సాగరులటు త్రిదివంబునకున్ 434

శుచియై, భగీరథుండున్
బ్రచుర రైశ్వర్యానుభవిగ, బ్రముదితుడై, యీ
యచలన్ బాలించె ద్వదీ
య చరితము జగద్ధితంబు నచిరము గాగన్! 435

తమ పుణ్యంబది పండెనంచు జనులున్, ధాత్రీ మహాదేవియున్,
దమ భాగ్యంబది నిండెనంచు మునులున్, దైత్యారి సంఘంబులున్,
దమ ధర్మంబది మెండటంచు జగమున్, తత్త్వజ్ఞ పర్వంబులున్,
రమణీయార్థ కృతజ్ఞతాభిమతి స్వర్వ్యాప్తిం బ్రశంసించగన్ 436

త్రైలోక్యానందకరము
శైలేంద్రోద్భవ చరితము; స్వస్తిస్థితిదం;
బాలేఖ్యము జనగణ హృద
యాలయ కుడ్యంబు మీద, నాలాపముగన్! 437

ఒక సౌహిత్య కళానురక్తి బుత సంయుక్తోపదేశం బి డె
న్నొక సాహిత్య కళానుషంగ మిడె - సంయుక్తానుబంధార్థమున్
బ్రకటాధ్యక్ష పునీత భాషణమటన్ బ్రాధాన్య పాత్రంబుగా
సకలంబై క్రమమయ్యె - మౌని; రఘువంశ్యాస్వాంతధామంబులన్. 438

ధన్య గంగకు నతులిడి ధన్యతగొని
సాగరాన్వయ కీర్తికి స్వాంతమందు
మన్నిక నిడుచు రామలక్ష్మణులు కదలి
ముని యడుగుల వెంబడి బడి ముందుకేగ... 439

## ఉపాఖ్యానతాత్పర్య శ్రుతులు

దేవదైత్య శత్రుత్వ గాథా విశేష
ఫణితి తెలిసె; మది మహోత్సవమ్మెసంగ
క్షీరసాగర మథన కథారసంబు
గ్రోలినారు - వాఙ్మి కథన శైలి లోన! 440

కీర్తి కాయవితతికెల్ల కృతులు, నుతులు,
నతులు శతప్రకృతి నతి వినయధృతి నని,
దాశరథి తాల్చె దత్ను కృతతతి ఫణితి
తన నియమ గుణవర్తన ఘృణుల యందు! 441

అనవుడు లక్ష్మణుండు కనులందున చెమ్మల పాయకట్టగన్
మునివరు దిక్కు జూచి యనె 'మ్రోగె వివేకము మీ స్వరంబునన్
వినిచెను మీ వచస్సు సమవిజ్ఞత; ధన్యులమైతి మేము; నూ
తనముగ నొక్క భాషణ విధానము దక్కె గవీంద్ర జాతికిన్! 442

ఇది మన సంప్రదాయ మిదియే గద జాతికి వారసత్వ మి
య్యదియె – గతానుపూర్వక చిరాయతకీర్తికి వైజయంతియున్,
సదమల నీతివృత్తము; సుచర్యల సారము, మేలు కూడికల్
విదితము జేసె – మీ నుడుల వెల్లడియైన మహాప్రసంగముల్. 443

ఇది మా భాగ్య మదృష్టం
బిదియే తమ మత మభిమత మిది తమదగు న
భ్యుదయా కాంక్షయు, హృద్దే
శదర్శనము బోధపడియె స్వామీ మాకున్ 444

తమకే చెల్లినది విధా
న మచ్చులను నేర్చుట వలనన్ గద హల్లుల్
నెమకుట సరియగు; నౌచి
త్యమున కొనరుపడు కథోచితములొనగూడెన్ 445

అంత యమనియమాఢ్య సంయమిగణంబు,
దాశరథులు, గాధితనుజుండు – త్వరిత గతిని
కాలు సాగించ, గమనానుగతముగ జను
చుండ జెప్పె గథల గౌశికుండు మరల! 446

విదిత దితితపమ్మును పూర్వ వృత్తమెల్ల,
నాపయిని విశాల పురగుణాఢ్య విభుల
నెఱుక పఱచె; నంతంతలో నేగుదెంచె
సుమతి భూపు డిక్ష్వాకు వంశోదధిశశి! 447



తనదు కర్తవ్య మేచిపూచెనని యర్ఘ్య
పాద్య విధుల సుమతి – వేదవేద్యు గాధి
సూను బూజించె, సంతోష చుళికితాంత
రంగుడై మునిదీవించె ప్రభువు నపుడు! 448

## అహల్యా ప్రలంభప్రబంధము

పోయెడు దారివేగమున బోవుచు మార్గమునందు సంయమి
ప్రేయము, సాధుసంహతి చరీయము; గూహనశక్రసాధితో
పాయము, కీర్తి హేతి ననపాయము, విస్తృత దర్శనీయ మి
చ్ఛాయత ధర్మసాధన నిసర్గ విధేయము, సాధ్యకాయమున్! 449

తానుగ భాసిల్లుచు నస
మానశ్రీ వెలిగె నాశ్రమ మనెడు చాయల్
కానంబడుచున్న నెలవు,
స్థానీయులు లేని భూమి దర్శనమీయన్, 450

ఆ రఘువీరు డప్పుడు కృతాంజలియై ముని కిట్లనెన్ "మహా
త్మా! రమణీయమై వెలిగి తాలిమి వీడిన పచ్చవోలె; నా
కారము నందెదో ధృతి బ్రకాశ వికాసము గోలుపోయిన
ట్లూరుపు తీయుచుండె స్థలి – ఉగ్గము జారిన పాలకుండగన్. 451

మాసిన పట్టుబట్టవలె మానిత ధర్మరతీ విధేయతా
భ్యాస విహీన దుర్బలహృదంతర భావ తరంగ డోలికా
వాసిత వోలె, మౌనివర వర్జ్య తపస్సమరాశి వోలె, వి
శ్వాసపు కార్యవర్తనము పట్టిన స్వార్థపు బాటకైవడిన్, 452

ప్రేమ సంసార వైఫల్య, విగత జీవ
కుల్య, నిర్లీన నైర్మల్య; కుంధన తమి
తుల్య, సామీప్య నిరస్తశల్య – వోలె
నీ ప్రదేశమ్ము కన్పట్టు నెఱుక మాసి! 453

నిర్జనమ్ము, ప్రాచీనమ్ము, నిస్సరణము,
రాణహీనము, నిప్పచ్చరమ్ము, నిహ్నా
వమ్ము, శూన్యమ్ము, సంయమి వర్జితమ్ము
నైన నీవృత్తుగా దోచు వైన మనఘ! 454

ఇరులు బరువుగ మేసి చూకురున జిక్కి
మూర్ఛ పోయిన పొలిమేర మొగిని నిల్చె
పూర్వకథ యొకదుండనోపు - వివరించ
గోరు చుంటి నో వాక్యవిశారదాఖ్య! 455

అను శ్రీరాముని కోర్కె విన్న ముని తానైపల్కె- బ్రాచీన గా
థను 'దేవేంద్రుడహల్యగోరె, మహితాదర్శంబు బోనాడి లో
దనుకున్ గల్గియు నామె ఇంద్రు పడకన్ దృష్టాప్తి పొందాన జే
సిన కృత్యంబును  మూడు లోకముల దోచెన్, వేచె, గల్లోలమై. 456

ఆపయి నా యహల్యను బలారిని గౌతము డాగ్రహంబునన్
శాపదవాగ్ని ద్రోయుటయు సర్వులెఱింగిన వాస్తవమ్ము, నే
డా పద సంచయమ్మునకు హారతి బట్టుచు రక్షసేయ - గా
లాపతనమ్ము కల్గె; పదమాపక సాగుము శ్రీరఘూద్వహా! 457

అని వివరించె నంత కుశికాత్మజుడున్ మునులున్ రఘూద్వహుం
డనుజుడు లక్ష్మణుండు నొక్కటై మునుముందుకు సాగి యాశ్రమం
బున బదమూన - దాశరథి పూర్ణ శశిప్రభ గాంచె - దుర్నిరీ
క్ష్యను సతి నా యహల్య, ననఘాత్మ, తపఃఫలలబ్ధి నాయెడన్ 458

శుచియై, కల్మష రహిత సు
రుచియై నిల్చెను విభూతి రూపము - శీలం
బచిర ద్యుతులీనె, నహ
ల్య చిరతపః ప్రభ దశదిశల వెలిగె నంతన్, 459

పుష్ప వృష్టికురిసె, దుందుభులవి మ్రోగె
గౌతమ మహర్షి సమహర్ష కాశపుష్ప
హాసమును గనె సతిదరహాసమందు,
వరద తీసిన యేరుగా నరసె బత్ని! 460

మౌన భాషణంబె  గానమవగ దేరు
కొనిరి, చూపు గలుపు కొనిరి, వినిరి,
హృదయగత కృతజ్ఞతైక్య వందనములు
జ్ఞానకిరణ ప్రసరణమ్ము గనిరి. 461

పాదములంటి మ్రొక్కె నతి భక్తిని రాము డహల్యకున్, మహా
స్వాదుమనోరథాకృతిని సాధ్వి నహల్యను డాసి గౌతముం
డాదరమొప్ప రాఘవు పదాబ్జములం దన దృష్టి నిల్పె, నా
హ్లాదము మోమునం బ్రిదుల నప్పటి కయ్యది  ప్రస్తుతంబనన్! 462

వీకన్ రామపదాబ్జము
దాకెను - గౌతము గనుకలిదడమున్, రామున్
దాకెను-గాధిజు జూడికి
ప్రోక; పరావృత్తి హేల బులుగరి తెలియన్ 463

ఆపాదమస్తకమ్మును
చూపు నిలుపలేక తన కుచోపరిచేలం
బోపిన మేరకు కన్నీ
రాపుకొనుచు సతి యహల్య రాముని జూచెన్ 464

అసలే యశ్రువు లాపయిన్ హృదయసహ్యంబైన హర్షాతిరే
క సమాహారము సంభ్రమంబులొకటై కన్‌ఱెప్ప పై భారమై
మసకన్ గ్రమ్మగ జేయగా, నడుమ శ్యామక్షత్ర సన్మానితో
ల్లసితాంభోద మనోజ్ఞ కాండపటమల్లన్ జూపు బాధించెడిన్ 465

అనుకొని పరిపరి విధముల
మునిసతి రాము ముఖతేజమును గను కోర్కెన్
గనుగవ మఱి మఱి నులుముకు
గనె, గద్గద రవమున బలుకన్ బూను కొనెన్ 466

గౌతమ సంయమీంద్రు లట కాలము వేళయు నిర్ణయించి నా
వ్రాతను వ్రాయగన్, దపమె ప్రాణముగా నిట నిల్చియుంటి నా
చేతము నీపయిన్ నిలిపి, చీకటి విచ్చి వెలుంగు పావురాల్
చేతుల కందునన్న శుభ సృష్ట సమీహయె శ్వాసనీయగన్ 467

స్వామీ - యేమని చెప్ప కోగలను, ప్రస్తావించగా నౌనె? మా
ప్రేమారామము పాడు బీడువడె, నుద్వేగోక్తితో వారు - శ్రీ
రామానుగ్రహమంది నీవు కడతేరన్ బొమ్ము పొమ్మంచు ను
ద్దామ క్రోథవిముక్త నిర్మల మనో దాంతుండుగా నేగగన్; 468

ములుకోలు కట్టెకు ముంగూరు ముత్యాలు
గాలి తాకిడి కోర్చి వాలినట్లు
కడవేరు మిగిలిన గఱిక పరక పొరి
నేలపల్లట సైచి నిలిచినట్లు
కొండరాచేనిలో గుంటక కొఱముట్టు
జడివాన గోటోపి బడలినట్లు
అగడితలో బడి యదవదపడు పిల్లి
నీటి ముంపుకు వేచి నిగిడినట్లు

నిశ్చయము గల్గు కాలమ్ము - నిజము దెలుపు;
కర్మకంతము లేకున్న కలుపు తీయు-
బ్రతుకు పొలమున పరమాత్మ పాత్ర మెంచి,
యనుచు - బడియుంటి నీమెయి ననఘ చరిత! 469



శిథిల దేవాలయమ్ముగ, జిక్కువడిన
ఊఱలు దారంపు కండియ వోలె, మఱియు
నుప్పుతోడ తొమ్మిది నిండుకున్న - వంట
యిల్లు వోలె, మూల వడిన పల్లకి వలె; 470

శైత్య మొదవి చచ్చు వడిన సన్నప్రాణి
సరణి, కాలు విరిగిన మంచమ్ము పగిది,
కుప్పకూలి, తలకు చూపు నప్పగించి
దారి తెన్నులకె కలత దనుకు జేసి; 471

రావని కొంతసేపు, యనురాగముతో ముని చెప్పినట్లుగా
నీవిక వత్తువన్న సరణిన్ తలపోయుచు గొంతసేపు, నా
భావన మిట్టపల్లముల పాముల నిచ్చెన యాట జిక్కె, దుః
ఖావహ మయ్యెనో దశరథాత్మజ - మానస మొక్క డోలగన్! 472

పొత్తము వోలె కాయము విభూతికి నంకితమయ్యె, జిత్తమా-
కత్తుల బోనులో జిక్కిన తొగన్ దురవస్థల గొందళించుచున్
సత్తును జిత్తునున్ వెదుక సాగును; గుట్టుగ దీననైతి, వా
యెత్తగలేక మూగనయి యేకతముంటిని లజ్జనై, యిటుల్! 473

గౌతమానుకంప్యుల ప్రయోగఫలమొకటి
మానుషాధిపమూర్తి రామత్వ యాన
మొకటి; అవ్యక్తమౌ యోగ మొకటి - కలసి
భూతి ధన్యమయ్యె, బురావిభూతి గొంటి! 474

అను, నా నూతన రూప రూపకోచిత యహల్యాదేవి శ్రీరాముకున్
గనిపించెన్ - పరిశోధనోపచిత ప్రజ్ఞాసంజ్ఞగా; నింక నా
వనితారత్న మహల్యకున్ ఘనుడు తా బంగారుకాళ్లయ్యగా
గనిపించెన్; రచనంబు నింపె మది నేకార్థం బనేకార్థముల్ 475

గుండె దగ్గుత్తికను జేసికొని వచించు
తన సతి నహల్య జూచు గౌతమమహర్షి
కౌశిక మునిని, రామలక్ష్మణుల గాంచి,
కాలసంధావిధి నెఱుంగు కతన, బలికె; 476

ఏమయ్యా రఘురామ! యెంత శ్రమమీవీరీతి జేకొంటి వ
య్యా? మా పున్నెములన్ని యెన్నికద – సౌమ్యప్రజ్ఞ దాంపత్య శో
భా మాధుర్యము నీయబూనితివి, తద్భావ ప్రతిష్ఠన్ జగం
బోమన్ బూనుము నిక్కమై నిలుచు దద్యోగంబుపాదేయమై. 477

అని యొక్కండడి చొక్కపుందమికి లోనై బల్కు నా మౌనికి
ట్లనె దా రాముడు శీర్షమెత్తి, నియతవ్యాపారసంభాషలున్
వినయారూఢిని సాగిపోవునవి కావే స్వామి! నావౌనె యీ
ఘనతల్? కీర్తిగ దీప్యమానమగు నిష్క్రాంతార్హతా కామ్యముల్ 478

అనఘ ప్రజావనైక కలనాన్వితు డాపయి నిట్లు వాకొనెన్
మునివర – గౌతమార్య, కలుముల్ వెలసెన్, భవదీయ సూత్రముల్
జనవరు లెల్లరింక మనసా గ్రహియించెద రేము నాత్మచే
తనమును పొందినాము, సమధర్మము, శర్మము వ్యక్తమిత్తఱిన్ 479

అక్షయ ధర్మ వృక్షము సమాహిత పుణ్యలతా స్వరూపమున్
రక్షిత లోకపాళికి, సురావళికిన్ మఱి మాకు గూడ బ్ర
త్యక్ష నవోదయంబు వలె దర్శనమబ్బె, హితోక్త సంఖ్యకున్
లక్షణలక్ష్య మేర్పడె కళత్ర ధవాఖ్యలకున్ బటంబుగా! 480

మాకు గురుండు, సర్వమగు మాన్యుడు గౌశిక మౌని, మీ కథన్
గైకొనె, సంశయగ్రసిత గాథగ దోచును గాని, కాదటం
చీ కరణిన్ వెలుంగు ఘటియించెను, నన్నొక పెద్ద జేయుచున్;
ప్రాకట శక్త్యధీనునకు భాగ్యము పండె; నిమిత్త మాత్రుడన్! 481

తైలమును, వర్తి, అగ్నియు వోలె గుణము
తపము, పరమార్థ ఘృణియు గృత్యమొనరించె;
లో కత తెలిసికొంటిమి; మాకు ధన్య
గౌతమ కళత్ర జాత్యమ్ము కరదమయ్యె. 482

అనుచున్నంతనె మిథిలకు
జనువార్త యొకటి పునర్వచనముగ వచ్చెన్
మునియున్ రాఘవులు మఱియు
ముని బృందము సంభ్రమమున మురియంబడగన్ 483

నందనుడు శతానందు సందర్భమెసగ
సతి యహల్య ప్రేమతొరగ, పతియనుజ్ఞ
పరగ బ్రార్థించె గౌశికు వర సహృదయు
దనదు గాథ శతానందు కనుమటంచు 484

సరి, శ్రీరాముని గౌరవమ్ము, మఱియున్ సౌమిత్రి యందించు త
త్పరిపూర్ణాభిచరత్వ సంజనిత సద్భావాది గుచ్ఛంబులన్
మురిపెంబొప్పగ దంపతుల్ గొనిరి, సామోదాశ్రు ధారావళిన్,
మరియాదల్ పరిపూర్తియయ్యె, నటుపై మధ్యాహ్నమై డాయగన్; 485

## మిథిలా ప్రవేశము

స్నానసంధ్యల బూజల సలిపి రంత
భోజనమ్ము విశ్రాంతియు బూర్తియయ్యె;
కదలు సన్నాహ మేర్పడు ఘట్ట మేర్చె
సురుచిరానంద వర్ణ సంశోభ చెలగ! 486

దారిలో బాలకుల మోము దమ్ముల నొక
స్వాస్థ్య గాంభీర్య మూర్తిత్వ సరణి దోచె
మునికి; కొమ్మ చివరల వ్యామోహపడెడు
రెమ్మ చివురు మిసమిసల ఇమ్ము తీరు 487

పయనమాపి నిల్చె వాచంయమనమూర్తి
రాట్సుతులను జేరరా బిలిచెను
కాంచుదంచు జూపె గమనీయ దేశమ్ము;
చెప్పసాగె పురవిశేషశోభ! 488

మనమీ పట్టున జేరినాము మిథిలామధ్యస్థ దేశమ్ము; శ్రీ
జనకుండేలెడు రాజ్యమీ యవని, రాజన్యుల్ మునుల్ - జాతి చే
సిన పుణ్యంబని తద్యశో ప్రతిమ కాశీర్వాదముల్ వోయగన్
జనకక్ష్మాపతి కార్యధుర్యతకు నీ స్థానంబు, నాస్థానమౌ ! 489

నెరవు పొలిమేర శాంతియు నీరువాఱి
బుద్ధి గ్రమ పఱచు నిజము, భువన మోహ
నమ్మగు సుఖాయతనమన నమ్మవలయు
పోషిత సకలార్య - మిథిల! నీ భూమి గనుడు. 490

తానీ రీతిని మౌనియున్ బ్రచుర వాత్సల్యోక్తిలో నుండగన్
రానే వచ్చిరి స్వాగతాంజలుల, సామ్రాట్టానతిన్ బూని, యా
మౌనివ్రాత ముదాస్థి తాద్యధికృతా మాత్యా గ్రిమ దిన స్తోమ మా
హ్వానంబుల్ గురిపించ - ద్వాదశ దిన వ్యాలీన యజ్ఞంబుకై 491

రాముని మోహన రూపము
సామీప్యమునన్ గనంగ సంవేగాళ్ళ
ర్యామోదమ్ముల దృష్టిని
మైమఱపుల ముగ్గినారు మాన్యశ్రేణుల్ 492

రాముని జూచువారల పురాకృత పుణ్యఫలంబు పండె, నీ
రాము వికాసభాసురత ప్రాకట రాజ్య మయోధ్యనే యశో
ధామము జేసె, నాచరిత ధర్మపథంబు గ్రహింత్రు మాన్యు లీ
రాముని రాకచే మిథిల రాణ మరింతగ వాసికెక్కిడిన్ 493

అను భావంబులు మానసోల్లలిత సౌహార్దంబు బండించ, వ
చ్చిన వారెల్లరు జేష్ఠ దక్కిరన బ్రశ్నించున్ స్వభావోక్తి, ని
ల్చిన ఆశ్చర్యము కాకలీధ్వని గమించెన్ హెచ్చెలే యన్నచో
ఘన వైచిత్ర్యము యుక్తిలో మెఱయు సత్కావ్యస్వభావంబుగన్ 494

స్వాగతవృత్తము

శారికా వితతి స్వాగతమంచున్
సారస శ్రుతుల సల్లపనంబుల్
పూరగించిన వపూర్వ ప్రణాళిన్
పారిజాతములు ప్రాలను బోసెన్ 495

స్థాన బలమి కన్న తన బలిమియె మిన్న
యన్న విధము మిథిల యందగించె
గౌతమసుతు గూడి క్ష్మాపతి యరుదెంచె
సందడి యది యింక - సరి, సరి, సరి! 496

త్రిపదలు

సమధీత వేద్యుండు సమ్రాట్టు జనకుండు
విమల చారిత్రుండు, ధర్మ
గముడు, ప్రబోధన మూర్తి 497

సకల కర్మజ్ఞాన సర్గుండు ప్రాజ్ఞుండు
ప్రకట విశుద్ధ మనీషి
రకమైన పాలనాధిపతి! 498

దేవళమ్మున గంట, దీపకళిక రాజు,
నావికు చేతిలోన ఖజ
దీవెనాంతమున తథాస్తు! 499

చేయెత్తి నిలిచెనా చెట్టంత మనిషి తా
జనక పృథ్వీపతి జనుల కెల్ల
చెట్టంత మనిషిగా సేదదీర్చుటె కాదు
ప్రజలకు మహిత కల్పద్రుమంబు
కోర్కె దీర్చుటె కాదు, కుశలరక్షకు శౌర్య
మనవద్య గతి నిల్పి మనుచు ప్రభువు
రక్షసేయుటెకాదు రాజర్షియై ధీర
ధీద్యుతి జనుల కందించు విభుడు

ఆత్మవేదియె కాదు జ్ఞానాత్మకుండు
సకలుడు, నిఖిల విద్యాభ్యసనకలుండు
మనుగడ కడమనవి యగు మనసువాడు
తామరాకుపై నీరుగా దనరువాడు! 500

సార్వ భౌముడు పూజించె సంయమీంద్రు,
తనరు పరిచయము జరుగ దాశరథులు
నేత్ర పర్వమ్ము జేసి రనేక గతుల
యజ్ఞ వాటిక జేరినా రధిక హృష్టి 501

జనకునితో గాధి సుతుం
డనె - వీరలు దశరథ సుతు లా వేశికులై
ధనువును జూచెడు కోర్కెన్
జనుదెంచిరి శుభముహూర్త సంభావ్యముగన్. 502

ఏమేమో పరమార్థము
లేమేమొ తెలిసి తెలియని ఇచ్ఛాఘటనల్
స్వామియె సూచించె ననగ
రామాభ్యుదయమ్ము మెదలె రాజర్షి మదిన్ 503

చేతుల నంటుచున్ సొగసు జేయుచు బాలుర దగ్గఱొచు సం
ప్రీతిని రామమూర్తి సరవిన్ గొనియాడి యహల్యసూనుడా
పై తన బాధ్యతాదృతిగ వాకొనె బ్రాజ్య విదేహరాజ్య సం
వీతము లోకవృత్తము సవిస్తరమౌ బహుళార్థ రీతిగన్ 504

అనవుడు చేమోడ్చి తపో
ధను దిక్కె సావధాన ధావళ్యమునున్
బనిచి శతానందుడు తా
ననె నీ వహి - రాఘవద్వయమ్ము వినంగన్ 505

తరుణమునెంచి వచ్చిరి, కృతార్థుల జేసిరి మమ్ము - స్వామి మీ
పరహిత సంశ్రయమ్ము రఘు వంశ్యుల రాకకు హేతువయ్యె నా
పరమ యశస్వినిన్, ఘన తపస్విని మాతను జూపినారుగా
నరవరు గౌరవాస్పదుని నా జనయిత్రియు సంస్తుతించెగా! 506

విధికృత పూర్వగాథను సవిస్తరమైన యథాస్థితిన్, గతిన్
విధురము ద్వంద్వభావమును బేర్కొని యుంటిరె- రామమూర్తికిన్
వ్యథితమనస్క నా జననికందిన పర్యవసాన వృత్త మే
విధముగ సాగెనో తెలపవే మునిశేఖర! స్వామి కౌశికా! 507

మధురాక్కర
అనెడు గౌతమనందను నాకాంక్ష వినిన మౌని
యనియె, జేయవలసిన కార్యమ్మునే జేసినాము
జనని అయ్యహల్యాసతి - జమదగ్ని జేరినట్టి
వనిత రేణుక వోలె దా బరిణేత జేరెనయ్య! 508

## విశ్వామిత్ర - వసిష్ఠుల స్పర్ధ

అమలాచార విశారదాగ్రిము దహల్యా సూను డామీద న
య్యమలాచార విచారునిన్ సుగుణ విఖ్యాతాభ్ర కీర్తీశ్వరున్
సమవాదాశ్రిత సౌమనస్య గుణి విశ్వామిత్రు శ్లాఘించుచున్
బ్రమదంబొప్ప వచించె దద్ఘనత - శ్రీరామాదులుప్పొంగగన్ 509

ఘనుడీ కౌశికరాజమౌళి బహుయోగ్యంబైన కార్యంబులన్
తనియించెన్ బ్రజ, నాతడొక్క పరి సేనావాహినీ సేవ్యుడై
జనియెన్ శిష్టవసిష్ఠు నాశ్రమము, నిస్తంద్రామలాధ్యక్షధీ
వినతోదారుడునౌ వసిష్ఠుడిడె సంప్రీతాభిహూతి క్రియన్ 510

ఏకాక్షౌహిణి సేననున్ దనను సర్వేచ్ఛావిధిన్ బూజలన్
సాకల్యం బొనరించి శిష్టడొగి మృష్టాన్నంబు సంబారముల్
జేకూర్చెన్ సురధేనులౌ శబల నుత్సేకించి; యాజాడ నా
లోకించెన్ కుశికాత్మజుండు, మది నాలోచించె నుత్సాహియై 511

మిడియ యెట్టిదైనను వీను మిగుల లేదు
జనము నాలుకల తగులుకొనిన గాని
వింత యెట్టిదైనను బేరు రాదు
ఘనుడు నావంటివాని సాధనము గాక 512

ఎంతటి యదృష్టమిది నా
చెంతకు జేరిన శబళ, వసిష్ఠమునీంద్రుం
డెంతటి యభ్యంతరముల
నెంత యొనర్చినను సురభి నే గొని జనదెన్ 513

ఆపయి భేదవాదము లనాదర రీతులు రోషభాషణన్
రేపిన కోపతాపముల ప్రేరణ సర్వము నేకమై
తాపసి కౌశికుండు పటు దంభము జూపుచు గోవు గట్టగా
నాపద మీఱె, సైన్యము ననంతము దించెను, గోవు క్రుద్ధయై 514

పెరరేచెన్ పెరరేచె సేనలవి నాభీలోద్ధతిన్ దూకుచున్
హరియింతున్ హరియింతు నంచు సమ దివ్యాస్త్రంబులన్ దాకుచున్,
గరులై, భీకరులై, భయంకరులునై క్రౌర్యంబు, శౌర్యంబులున్
మరి ధైర్యంబులు బొంగి క్రుంగు సెగలన్ ప్రగ్గంగ బోరాడగన్. 515

పహ్లవ సైన్యమున్, యవన వర్గములున్, శకులెల్ల గౌశికా
స్త్ర ప్లుతి తీవ్రతన్ మునిగి సంహృతి జెందగ నీవియావు దా
విప్లవరీతి నుగ్రభట వీరుల యోధ పుళింద యూధ ము
చ్ఛృప్లుతమున్ సృజించి వివశత్వము జెందగ జేసె గౌశికున్ 516

అంతట గాధిసూనుడు శతాధిప సూనుల నాజిదింపి య
త్యంత రణోద్ధతిన్ నిగుడ, నయ్యరు లందఱ నొక్క హుంకృతిన్
వింతగ నా వసిష్ఠముని బిట్టడుగంటగ జేయ గాధిజుం
డంతరు వెంచి సాగె ప్రమథాధిపు సేవ దపోవనాలకున్ 517

అటుపయి గాధిసూనుడు మహాశివదత్త వరప్రసాదుడై
పటుతరమైన యస్త్రముల ప్రాపున నుగ్రతరాభిహూతి దా
గటుసిల పెళ్ళగించుకొని గ్రక్కున వెల్వడు చింతపిక్కపై
నటునటు లేచి నిల్చు చిగురై తన పంతము జూప నూకొనెన్ 518

హెచ్చిన సర్వ గర్వము లహింసను ప్రింగ, యహమ్ము, దంభమున్
రెచ్చ; నభద్రతా భయము రేగ, నమర్షము ప్రోగ, రోషమున్
గ్రుచ్చ, మునీశ కౌశికుడు, కోపి - వసిష్ఠు తపోవనమ్ములన్
జిచ్చుకు బెట్టె నస్త్ర బల చీవరమున్ విదలించి వైచుచున్ 519

సరియన రాని వాంఛిత, మసహ్యమునైన ప్రవర్తనమ్ము, తీ
వరమున దైవతాస్త్రముల బాలిశ ప్రేరణ దుర్వ్యయమ్ము జే
య రణ సఖీ నిషంగము, ప్రయాసహతమ్మును, రాజసాస్థయున్
బరుష సమాఖ్య గోరిన స్వభావము - గౌశికు దుష్టచర్యలన్.... 520

కని, దుస్సాహస దుర్వికార దురహంకారమ్ము లా గాధిజుం
గనులౌటన్ గని, యూషరమ్మగుచు నాకారమ్మునన్ నీరవ
మ్మున శూన్యంబుగ దోచు నాశ్రమపు భూముల్ గాంచి మౌనీంద్రుడ
య్యనఘుండైన వసిష్ఠుడుగ్రతను డాయన్ బ్రహ్మదండంబుతో, 521

నిట్టపు జూపులున్, కినుక నిండిన బిట్టున గాధిపట్టి – తా
నట్టిటు పాదఘట్టన మనాదర చేష్టల బట్టుబట్టుచున్
జెట్టు పడంగ గొట్టెద వసిష్ఠుని యన్నతలంపు గట్టి, యె
ప్పట్టుననైనగాని తన పట్టుడు మెట్టుగ నట్టహాసమున్, 522

జేయుచు, హుంకారమ్మును
జేయుచు, ననలాస్త్రము దొలి చేతగ, నాపై
చేయలతిగ నాత్మాస్త్రము
లా యతివరుపై వదలగ, నమితోత్కంఠన్ 523

చూచెదు వారికెల్లరికి జోద్యమెయయ్యె, ద్విసంధ్య లొక్కటై
పూచిన రీతిగన్, గుశిక పుత్రుడు మౌని వసిష్ఠ శిష్టుడున్
దోచిరి, గాధిసూను డొక తోరణగల్లుగ, నా వసిష్ఠుడున్
రేచు ప్రభంజనమ్మువలె రౌద్ర దృగగ్నిని రాచి తేయగన్ 524

సకలాధిక్యత తోడ గౌశికుడు యస్త్రౌద్ధత్యమున్ నమ్మ, తా
నకలంక స్థితిలో వసిష్ఠుడును బ్రహ్మౌత్కృష్ట్యమున్ గ్రమ్మ, క్లే
శకృతోదాస్థితు బ్రహ్మదండమును, విశ్వామిత్రు బ్రహ్మాస్త్రమున్
గ్రకచాశ్రిప్రభలన్ వెలార్చి వెడలెన్ గాలానలాభీలమై 525

మునులున్ నిర్జరులున్ త్రిమూర్తులును – సంపూజ్యంబునౌ, నా వసి
ష్ఠుని బ్రహ్మత్వ మహత్వ శక్తి నెనరున్ శోభావహంబయ్యె నం
చును – ధర్మేతర వృత్తికిం దిగు మునీశున్ గౌశికున్ బుద్ధియున్
గౌనమున్ గూర్చియు గూడి కూడి విసుగున్ గుంభించి వీక్షించుచున్.... 526

సంతోషమ్మును సంభ్రమమ్ము నమితాశ్చర్యమ్ములన్ దేలుచున్
శాంతింపన్ కరుణించ వేడిరి, వసిష్ఠాఖ్యుండు రక్షాకరుం
డంతన్ మానసతేజ జాగరము నా యాపత్తి దప్పించె, దా
శాంతిన్ జెందె– గతార్తి సౌఖ్యముల నాశ్వాసించె లోకంబులున్ 527

కింకర్తవ్యమ్మనియెడు
సంకటమున దగులుకొనియె సంయమి, మదిలో
జంకుచు – నీరందని వరి
కంకుగ నిలబడెను కౌశికవరుం డటుపై 528

తన ఇచ్ఛాసామర్థ్యము
తన జ్ఞాన పరాయణత్వ తారుణ్య శతం
బనపాయంబను నమ్మిక
చినుగగ గ్రోధ విషధి నిలిచెన్ దీనుండై 529

నానా శౌర్యక్రీడలు
వీను మిగిలినట్టి యస్త్ర వీర్యము లెల్లన్
హీనములై పోవ, సమా
ధానముడిగి నిల్చె గాధితనయుం డటుపై 530

"అంతటి బ్రహ్మాస్త్రమ్మే
యింతగ మొక్కపడెను పదనిటిసె, బిసిచెడెన్
వింత – గరిష్ఠార్భాట
మ్మింతగ" థు'స్సనె' మహత్వమింకెను, గ్రుంకెన్ 531

బ్రహ్మ తేజమ్ము ముందు క్షాత్రబల మణగె
వ్యర్థమైపోయె దపము సర్వమ్ము, నోటి
బాండువగ మిగిలితి? నోటి పలుకు, కోర్కె,
గంతు, లరచేతిలో నిప్పు కణిక లయ్యె 532

అని తలపోసి గాధిసుతు డాత్మకు బట్టిన కెంపు తగ్గగన్
దన పని నిశ్చయించె నుచితంబుగ, దా విజితేంద్రియత్వమున్
గనుటయు బ్రహ్మసత్త్వ సమకల్పనమున్ రచియించు టంచునున్
ఘనతరదీక్ష గైకొని యెకాయెకి సాగెను దక్షిణాశకున్. 533

దినములు జారె, మాసములు దీరెను, కార్తెలు వత్సరమ్ములున్
వెనుకకు బాఱె, నంత ద్రిదివేశ సమమ్ములు మూడు మారె నా
ముని కుశికాత్మజుండు తపమున్ జరియింపగ, బ్రహ్మదేవు ద
ర్శనము లభించె జిత్రయుత సంచికలో బుట ద్రిప్పినట్లుగన్ 534

జలజాతాసను డా మునీంద్రు దెస గాంచన్ హృష్టుడై చెప్పె - నీ
యలుకన్ వీడుము, చాలు చాలు ననుకంపాగ్రేసరా రాజర్షివై
నిలుమీ - మౌనులు, నిర్జరుల్, జనులు, మన్నీంద్రుల్ ప్రశంసించగన్,
ఫలితము 'పిండి కొద్ది' యను వక్కణముండదె లోకరీతిగన్! 535

అని విధి నిష్క్రమించ, మునియాత్మవిమర్శనమందు మున్గె; వా
డిన విరి బారవేయు కరణిన్ బలుచేష్టల గ్రుంగి క్రుంగి - నే
నెనయిక నింతజేసి ఫలమేమి? తపోబలమేమి తెచ్చె? వ
చ్చిన ఘనగౌరవమ్మిదియె? చిక్కిన యీ బిరుదమ్మిదేలకో? 536

మన మెదిగించ దప్ప దనుమానము లేదు, కృతార్థతన్ గనన్
వని జని శాంతచిత్తము దపమ్మున నింపి కొఱంత వంత లే
కను పరమోత్తమంబగు ప్రకామము సాధన జేతు, జేతు నా
ఘనుదు వసిష్ఠుదౌనన, ప్రకాశ మహత్వ వికాస మేర్పడన్ 537

అనుకొని తమ్మిచూలికి గృతాంజలి మేకొని శాంతమూర్తియై
పునరురు యత్నబద్ధుడయి ముందడుగున్ గదలించె, లోకమం
దనుశయ భావమయ్యది మహాభరమన్నది నిక్కమయ్యె; బం
చెను మది సూక్తి 'సిద్ధియది చేసిన వారికి చేసినంతగన్'! 538

అప్పటి కప్పుడీ ఘటన మంతయు 'నచ్చట' జూచుచున్నదే
వప్పలు సంయమీంద్రు లనివారిత బుద్ధి మరల్పలేక మే
లొప్పెడు లోకనాథు దిశ నుత్సుకతన్ గన మాధవుండు - గన్
ఱెప్పల లోనె గాథ వివరించెను, పండిన భావరూపమై - 539

అంతర్ధానము చెందెను,
చింతన తన యతనమునకు జిందులు వేయన్
పంతువరార్థము చనె నా
ద్యంత లిఖిత వక్రరేఖ యన గౌశికుడున్ 540

చేతయె భావనాకృతము, చిక్కులు చేతల వెంటబర్వు, నీ
జాతర జిక్కినన్ తిరిగి శక్తిని యుక్తిని గూడగట్టి, సం
వీత సమీహనున్ లవణి వీడని దిట్టగ జూపి గాధిజున్
గౌతమపుత్రు డప్పు డతి గౌరవమొప్ప నుతించి, వెండియున్ 541

అనియె శతానంద సంయమి వరుండు
గాధిపట్టి పట్టు దెలుపు గాథ లుండె,
ఘన తపోబలాంబుధి తరంగముల క్రింది
శుక్తితతు లవియెల్ల రాట్సూనులార! 542

## 'త్రిశంకుస్వర్గం'

సత్యభాషణుదు నిక్ష్వాకు వంశ చరిత
కొక క్రొత్త పుట గూర్చె బ్రకటకీర్తి
సచ్ఛీల వర్తన సద్గుణ పోషణ
జంట పేర్లుగ దాల్చె శాంతభక్తి
దుర్జ్ఞేయమును - నభూతో నభవిష్యతి
యగు వాంఛ బ్రకటించె ననఘమూర్తి
స్వప్న వాస్తవమును వాస్తవ స్వప్నము
నసిధారగా బూన్చె నతుల శక్తి

పావనోజ్జ్వల కళాస్ఫారయుతుడు
లోక విఖ్యాతుడౌ కథాలోక చారి
జగము లల్లాడ నొక్క హెచ్చరిక జేసె
జటిల ప్రశ్నార్థకమ్ము త్రిశంకు నృపుడు! 543

అట్టి ప్రభూత గుణాఢ్యునికిన్ గల్గె
బొందితో స్వర్గమ్ము పోవు కోర్కె
కులగురువు వసిష్ఠు గోరెను యజ్ఞంబు
జరిపించి కోర్కె నిజమ్ము జేయ
నిది దుర్లభమ్మిది యేలనో నయశాలి!
కోరరాదని చెప్పి గురువు పనిచె
పట్టు వీడని రాజు వాసిష్ఠులను జేరె
నింతింతయై వారు నేవగించ

నెక్కడకు బోదు, మరియు దిక్కేదినాకు,
తెరువుగా నమ్మి వచ్చితి, గురువు మొండి
చెయ్యిజూపె, నా వాంఛ మీరియ్యెడ నిటు
కాలరాయ వలదనుచు బేలయయ్యె! 544

సంయమీంద్రుడు వసిష్ఠ భగవానుండె తా
గాదన్న పనికి బోరాదు మేము
యాగమ్ము వల దేద్పురాగమ్ము వలదింక
పొమ్ము పొమ్మన్న, నపూర్వరీతి
దీక్షవీడని రాజు దీర్ఘరోదన జేయ
విసుగు దిగద్రావి వినిన వారు
నచ్చచెప్పిన సహనమ్ము వమ్మయి పోవ
ఛండాలుడై పోవ శాపమిడిరి

బుద్ధి భూము లేలుచు నుండ బొమ్మరాత
యేమొ గాడిదల్ గాయుచు నేద్చుచుండె
ననిన రీతి దోచె; త్రిశంకు దవని దిరుగ
దిరుగ, నేకాకితనము దుర్భరము నిజము! 545

గురుసుతుల కినుక కొలది త్రిశంకుడు
శాపమే అంగవస్త్రమ్ము గాగ
కోరని వారిని కోరక గోరుచు
శుష్కహస్తమ్ములు శూన్య సూక్తు
లెదురు దెబ్బలు గాగ, నిటుపోయి యటు పోయి
కాల కుంభీర దంతాల జిక్కి,
పళ్ళ బిగువున బైబైకి లేచి కడకు
కడగన్ను బ్రార్థించె గౌశికముని -

జరిగినది విన్న సంయమివరుదు - గాధి
తనయు డభయ హస్తము నిచ్చె, తానె యజ్ఞ
నిర్వహణ మూన్చి, కడతేర్చి, సర్వమేర్చి
స్వర్గ మార్గము సుగమమై వరలజేతు. 546

అనుచు, విశ్వామిత్రుడా సవనార్థము
ఋత్విజుల, ద్విజుల, ఋషుల, బుధుల
రావించు యోచనారంభ మందె- మునికి
నాత్మజు లరుదెంచి హంసపాదు
పలికిరి - వాసిష్ఠు లలుగుట, దూషణ
వర్ణించ, మౌని - కోపప్రతాప
రోష సంతాప ముగ్రోప హేతువుగాగ
నీచ ముష్టిక జాతి నిక్కి నీల్గ

వికృత రూపులుగాగ శపించెవారి;
నా వరుస సుత ధూర్తత నామతించి
నట్టి యా వసిష్ఠుని నిషాదాఖ్య బుట్ట
ఘోర శాపమిడెను గౌశికుం డకరుణ! 547

అటుపైన, మంత్ర, మాహాత్మ్య కోవిదులు, న
ధ్వర విధిజ్ఞు లమిత తత్త్వవిదులు
ఘన తపోధనులు, లోకాచార వర్యులు
కర్మచారులు, మహాధర్మపరులు
క్రతుకర్మ నిపుణులు, కృతముఖ మఖదక్షు
లాచరణ వ్యవహార విదులు
సంస్కార సిద్ధులు, సన్మాన బుద్ధులు
సాధనోత్కర శుద్ధి సాధకతతి -

వారు వీరననేల - సవన మవిఘ్న
మగుట కెవ్వారు వలయునో అట్టి ఘను ల
నేక యజ్ఞ విధానముల్ నేర్చినట్టి
యతులు దిగిరి, గాధిసుతుడె యాజకుండు! 548

యజ్ఞోత్సవోప సంహారోపహారము
దైవోప హాసమై దాపురించ
నైజ హవ్యముల గొనంగ సురలు రామి
గుపితుడయ్యెను, మౌని క్రుద్ధుడయ్యె
నందని ప్రాని పండన్న సామెత తన
దరి నిఘంటువున కందనిదిగాన
నిష్ఠురోత్కట తపోనిష్ఠ జేగజ్ఞగా
దాల్చి తా హుంకృతి దడవె, నుడివె

'పొమ్ము, దేహమ్ము తోడ నపూర్వ రీతి
స్వర్గ దేహళి దాటి, నిర్జరుల మేటి
గుండె డిల్లన, నా పేరు గూడి నీదు
నామము త్రిలోక ప్రసిద్ధి, నవతగాంచు! 549



మౌనిగాధిజు తపోమహిమ త్రిశంకుడు
శీఘ్రమై స్వర్గమ్ము జేరసాగె
జూచు వారల కెల్ల జూడముచ్చట యయ్యె
నద్భుత స్వర్లోకయాన మపుడు
ఘనదేవపతి త్రిశంకుని గాంచె, 'స్వర్గమ్ము
గురుశాపహతుల కగోచరమ్ము
నీవుట్టి కెక్కగ లేవిట్టి పనులేల
సశరీర నాకమా చాలు చాలు'

నని తృణీకరించి పలికె, నమరు లెల్ల
బరిహసించ నింద్రుడు రోషపాటల మగు
కనుల నదలించి తలక్రిందుగా ధరబడు
మనగ - 'త్రాహి' యని నృపుడు తల్లడిల్లె! 550

తనయాజ్ఞ, తనపట్టు తలక్రిందులై పోవ
శిఖి శిఖాకృతిగ కౌశికవరుండు
బుడమిపై పడబోవు పుడమి పతిని బట్టి
'యుండు మచ్చట'నని యూది నిల్పె,
స్వర్లోకవాసుల స్వార్థమ్మునకు సమా
ధానమ్ము నిచ్చెద దశలు తిరుగ
శ్యామయో లేక విశ్వామిత్రుడో తేలు
దర్శ దర్శనములు తత్తఱిల్ల

ననుచు, నపరబ్రహ్మగ మారి యాకసమ్ము
మధ్య నృపు జిక్కబట్టి సమస్య నోపి
దక్షిణాశను గూర్చె సప్తర్షిమండ
లమ్ము, వేరు నక్షత్రమాలయును కలిపి! 551

పదపడి నక్షత్రవంశమ్ము సృజియించె
నతికోపి యా కుశికాత్మజుండు
నిం్రదుడింకొక్కని నిట దింతు లేదన్న
నింద్రలోక మట సృజింతు నంచు
గ్రతుభుజసృష్టి ప్రారంభించ సంభ్రమా
శ్చర్య చేతస్కులై సంయమి తతి
యనునయ వచనమ్ము లర్థవంతము జేయ,
గాధిజుం డాశించె - జ్ఞాననిష్ఠ;

దాను జేసిన ప్రతిన సత్యమ్ము నిత్య
మై వరల వలయు ననుచు, నంత సర్వ
దేవ సంఘమ్ము కౌశిక ధ్యేయమునకు
భద్రమనిరి, తథాస్తు దీవనము నిడిరి. 552

పిడికిలి విసిరిన పిండి గోలీకాయ
లీ రిక్క లే యన నేపుజూపి
వైశ్వానర పథము బయటగ జాజ్జ్వల్య
మానమై వరుణము మహితమగును
దానవారుల వోలె తారకా మధ్యస్థ
డగుచు నధోముఖుండగుచు నిలుచు
నీ త్రిశంకు వతని నివసన మనధీన
సదనమగు 'త్రిశంకు స్వర్గ' మనగ

ననియె; సురలు ఋషులును మహామహులును
గాధిజు నుతించ సంతృప్తి కలిగె నిజము!
గెలిచి ఓడెనో, ఓడియే గెలిచెనో, మఱి
తిరిగి తా తపోభూముల మరలె మౌని! 553

జారుడు మెట్లపై తపము సర్వము నాటగ జేసె సం
స్కార హితార్థియై నిలిచి గౌశిక సంయమి తత్ప్రతాపముల్
నేరమె? పట్టువీడి మననేరదు, మీరదు మాటనిచ్చి, వి
స్ఫార యశస్కుడయ్యెను - నిజాత్మ వికాస విభూతి జూటుచున్ 554

ఇది సరి - ఏ కథ జూచిన
విదితం బీ గాధిపట్టి విశ్రుతి, మఱియున్
సదమల మాశ్రిత వత్సల
త దయయు, ప్రేమార్ద్ర చిత్తతత్త్వము లెల్లన్ 555

## 'రెంటికి జెడిన రేవడా?'-శునశ్శేపుడు

మధ్యాక్కర:
పుష్కర తీర్థంబు జేరె, బూనె విశ్వామిత్ర మౌని
దుష్కర తపము, మహీభృతుండంబరీషుండు పూనె
బుష్కల శుభసమీహాప్తి పురణించ యాగమ్ము నొందు-
విష్కంభమేర్పడె, యాగ వేగి యపహరింపబడగ. 556

హయనష్టంబు ప్రమాదమౌ కతన రాజ్యాధీశుడున్ గోసహ
స్రయుతుండై జనె, నాశ్రమమ్ములును, దేశంబుల్, బురంబుల్, జనా
శ్రయ భూముల్ వెదుకన్ - మనీషు నొకనిన్ సాధించ, నా త్రోవనే
జయమున్ సంభవమంచు ఋత్విజులు, నోజల్ సూచనల్ సేయగన్ 557

త్వరగ నెంతెంత దూరమో పరుగు పెట్టి
'యలసి పోయితి' భావన నంశుధరుడు
దిక్కులను జూడ చిత్రమై దక్కె; దాను
కదలకయె జేరి యుండె - శక్రదిశ కడకు! 558

తూర్పు తెల్లవాఱె దుందుడుకు గతిని
కొందఱి బ్రతుకులను గూడ తెల్ల
వాఱ్చు యత్నమూన వచ్చు ననగ బోలు-
ననగ ననగ నెఱ్ఱనయ్యె నభము! 559

మధ్యాక్కర
చనిచని అంబరీష వరజాని ఋచీకమౌని గనె,
వినిచెను సర్వమున్, గోర్కె వినిచెను, ధనము ప్రసక్తి
వినిచెను, వినయము మీఱ వేడెను బిడ్డలలో నొక్క నీయ
మునియు త్వదీయ గేహినియు మూగవారయి తేరిచూడ! 560

కింకిర్తవ్యమ్మని ఈ
వంకల నావంకల గను వసుధాధిపుడున్,
శంకాకుల చితమునం
దింక జివరలందని గతి – యేకాంగులకున్! 561

మధ్యాక్కర
ఈ సమస్యయొక గ్రచ్చుపొద, యిక స్వయముగ దల్లిదండ్రు
లే సమ కట్టిరి సుతుల లేళ్ల బేరము లిరువైపు
మోసపు టెత్తులున్ మఱియు మూర్ఛపు పైయెత్తు లయ్యె
నా సంతతి పరిస్థితి గన – నచ్చెరువు చెఱువు నిజము! 562

ఎవరొ వాయెత్తి మాటాడు వ్యవధిలోన
ధరణిపతి చూపు మరలె మధ్యస్థుపైకి
తల్లిదండ్రుల కనుసైగ తాకె వాని
దండ్రి యుచ్చరించె ద్వితీయ తనయు బేరె! 563

అదుగో – యతడె, శునశ్శే
పుడు, మాతాపితల కొక్క పులిపిరి వోలెన్
నడుమను నలిగిన వాడై
యడుగిడె మనమడుగు ప్రశ్నలడుగగ వెడలెన్ 564

అమితాశ్చర్యము వెన్నులో జలదరింపై యొక్క యూపూప, డెం
దము నందొక్కటి మున్గుచున్న 'తరి' చిత్రంబౌచు గాన్పింప, సం
భ్రమ మాస్యంబున చాయజూప, 'వెలి' భావమ్మొక్క భూతమ్ముగా
నమలన్ సాగెడు నంత దెప్పరిలి చింతన్ జెప్పె నీయోగతిన్ 565



చల్లగ నెంతమాట విను సంభవమియ్యది – నాదు తండ్రి – మీ
యుల్లము దెల్లమయ్యె దమ యుద్భ్రమ మంతయు బొంగిపొంగి మై
దుల్లెను, కన్నడీ దనకుడో జనకా! తమకౌ కుమారుడన్
పల్లెకు గూడెమట్లు నను వాకిలి కావల ద్రోసి వైతువే? 566

చిన్నతనంబు నందు నరచేతులు కంద, ముఖంబు వాడగన్
ఖిన్నుడవైన వాడ వొక కేలను చేతిని బట్టి వెంబడిన్
నన్నటు వేదమందొక పనాయిత పన్నము వల్లెవేయు మం
చన్నపుడెప్డు నీ మదికి సందియమిట్టిది యంటలేదుగా? 567

కన్నులు విచ్చిచూచి చిరుగాలి దిసంతులు దేహమెల్ల సం
పన్న దుకూలమట్లు నలవాటున దాల్చి చరించు నన్ను – నీ
మన్నన కన్ను సన్నలను –మంతగ, మందట, మందలించి – ర
మ్మన్న విధమ్ములన్ మఱచి మందుడనౌదునె; సాంధ్యవేళలన్! 568

జవజీవంబులతోడి రూపమిడి శాస్త్రప్రౌఢి సంరూఢి చే
ప్రవరన్ నాకొక స్థానమిచ్చి, విధిగన్ బ్రహ్మోపదేశంబు జే
సి, వెలుంగున్ దిమిరమ్ము బోల్చు నిశితోత్సేకంబు ధీనింపి యీ
భవనంబందున దీపమార్పుటది దుర్వ్యాపారమౌ సంయమీ! 569

స్వరయుక్తంబుగ సంధ్యవార్చు మనుచున్ శాసించి నా ముంగిటన్
కరమందొక్కటి వేపమండగొని ముక్కాల్ పీట గూర్చుండి – నే
నెరవై నేర్చిన రీతిలో దొసగు లేవేవో సవన్ జూపి, యా
వరవిద్యన్ బరిపూర్తిగా నిడిన మీ వాత్సల్య మీపాటిదే?! 570

నా మది పిల్లి పిల్లల ననాదర భావన నిండి యుండగా,
గీముకు జుట్టు ప్రక్కల నొగిన్ సరిచేసి, బిడాల సంతతిన్
ప్రేమము మీఱ దెచ్చి మన పెంపుడు పిల్లుల జేసి చూపుచున్
చీమకు దోమకైన జెడుజేయగ రాదని బోధజేసిరే! 571

ప్రామిన చీకటిన్ దునుము ప్రశ్రయవర్తన బ్రస్తవించి, వి
ద్యామయమైన జీవనవిధానము భూతదయాస్థ యంచు, నే
నీమపు వెల్గుతో బ్రతుకు నింపుకొనంగ హితోక్తి బల్కు - నా
స్వామివి, న్యాయమా యిటుల వధ్యశిలాధ్వము మీరె జూపగన్? 572

అనుచును దండ్రివైపు నౌక యంత్రపు జూపును నూతినూతి, యో
యనఘచరిత్ర! తీర్పునిడి హాయిగ నాలుగురాళ్ళు చేత రా
గౌనిరిక మీ కుమారు డొనగూర్చు సుఖంబుల జేరుడంచు - దా
జనని దిశన్ మొగంబునిచె, జారు ధృతిన్ బురివెట్టి యిట్లనెన్ 573

'నవమాసంబులు మోసిమోసి నిను గన్నా నోరి నాకన్న!' యం
చవఘోషన్ బలుమారు బల్కి ప్రియవాత్సల్యమ్ము బొంగించి, నా
రవప్రాణమ్మును నేనెయన్న క్రియ సర్వాంగీణ మాతృత్వ రా
గవశిత్వమ్మును జాటు తల్లి! యిపుడీ కాపట్యమున్ జూపితే! 574

ఓం నమః శివాయ యనుచు యుత్సహించు
యక్షరాభ్యాసవేళ నీవచట నునిచి
నట్టి ఘంటమ్ము - నే - ముందు నందుకొంటి
ననుచు మురిసిన అమ్మ! నన్నమ్మ గలవె?! 575

అట్టి ముద్దుముచ్చట లెన్నొ యందతికిని
పంచి, నా చిట్టితండ్రి, నా భాగ్య ఫలము
బాబు - ముంగిట ముత్యమ్ము వంటివాడె
యనుచు జెక్కిలిని పుడికి యలరినావు! 576

చిన్ని రామన్న వేసమ్ము నెన్ను కొనుచు
నెంత యెంతలొ చేసి, నన్నింత జేసి
తీర్చిదిద్దిన నీదు తితిక్ష జూచి
తల్లిప్రేమకు నిలువుటద్దమ్ము నీవె.., 577

అనగా నామది నీదు మూర్తికొక దివ్యద్దేవతా రూప భా
వన నిండారగ జేసి నిల్పితిని జీవజ్జాతి జాతీయ కే
తునికేతమ్ముగ, దల్లి గూర్చి పలురీతుల్ భక్తి నిండారగా
నను కొంటిన్ గద! భావమున్ భవనమున్ యౌష్మాకమై త్రెళ్ళగా! 578

పనిబడి గట్టు వెంటబడి పర్వులమీద పొలమ్ము పోవు దా
రి నౌక సరీసృపమ్మును దరిన్ గమనించి భయమ్ముదాక, బె
ల్లున జ్వరమెత్తి రాత్రి, యొడలున్ మది తెల్విని లేక మూల్గగన్
ననుగని క్రిందు మీదబడి, నాతల నీ యొడి బెట్టుకొంచునున్ 579

కొనలను నిల్చు నశ్రువుల గ్రుడ్లను గ్రుక్కుచు, నాన్నతోడ నే
మన బెదవాడ రాక, మతి - అంధికకున్ జన నొక్క భీతి, నిన్
బెనగొని యూపునూప, ద్వర, వేమఋ - నా మొగమున్ బరీక్ష జే
సిన జననీ! ననున్ బశువుజేసి యదల్చుచుద్రోల, న్యాయమే? 580

కొంగుబట్టుక కైతల గూర్చి జెప్ప
గనుల జికిలించి మురిపింపు గనుల జేసి
శ్లోక పాదమ్ము లొకకొన్ని సేకరించి
నాకు బునరుక్తిగా జేసినావు కాదె! 581

ఒడల బులకింప జేసిన యుద్భ్రమమ్ము
కడకు నీరీతి యుద్భ్రాంత కరుణ యయ్యె;
నిధియు బెన్నిధి యనుకొన్న నీదుప్రేమ -
నిగదితము జేసె - 'రేవడు' - నెగ్గడంచు! 582

పేరుకు దల్లిదండ్రి, నెరవేర్చిన కార్యము స్వార్థమే; దగా
కోరులు గారె వీరు? మెడకున్ బెను గంటను గట్టి - దూడ నీ
తీరు కసాయి కమ్మి తరితీపును జూపిరి, చాలు నింక వ్యా
పారము, పోయి వత్తునని వాకొని ముందుకు జూచుచుండగన్ 583

కొడుకే తిట్టిన తిట్టు తిట్టకిటు వాక్రుచ్చంగ పైపైకి వ
చ్చెదు దుఃఖమ్మును కండ్లలోయలకు జేర్చెన్ - దండ్రి - యే యుత్తరం
బిడ యేమౌనొ యటంచు 'దెబ్బలకు లోటే రాజు లౌనన్న' - కై
వడి వైక్లబ్యము, భీతి, శంక కయికాల్వాయిన్ నియంత్రించగన్, 584

కాలము గాలమై నృపుని కామన వెల్వడ, గండకత్తెరన్
వీలుగ దప్పుకోదలచు ప్రేరణ ముందుకు ద్రోయ, వేగమై
బాలుని పెద్దవాని నిడ భావ్యము న్యాయము గాదటంచు నే
దూలితి మాట, నత్తఱిని తోచిన భాషణ దోషమయ్యెనే! 585

ఏ పన్నాగము లేదునాకు మనమం దీ రీతి 'రేవండు'గా
నా పుత్రున్ నిలుపంగ నే నహహా! అన్యాయైక పక్షార్థినే?
కోపావేశమునందు కన్నకొడుకున్ గ్రూరుండనై వీడగా
నే పెచ్చారినె? లో వెతల్ దెలియనౌనే చూచు సామాన్యుకున్! 586

బలవంతుడగు రాజుకున్ బదులుగా బల్కాడ నా నోట యే
పలుకున్ రామి గదా, కటుత్వమున సంపాకుండు వీడంచు నన్
దలచెన్ జీవను డింక లోకమది స్వార్థాసక్తుడీ తుచ్ఛు డం
చలదన్ బోలు కలంకమున్ - హతవిధీ - అంబేకే బాధలా? 587

లావుల్ గల్గినవే? క్షితీశు హవ ముల్లంఘించగా, దాపు
త్రావేక్షారతి నాదు బాధ్యతయె కాదా? ప్రాప్యసిద్ధ్యంశముల్
లేవా? ఈప్సిత బంధముల్ విడచుటా? లేదన్నచో దీంద్రమై
చావో రేవని మొండిపట్టు నిలుపన్ సాధ్యంబె నాబోంట్లకున్? 588

అని పరిపరి విధములుగా
ననుకొని సంయమి బుచీకు డాలోచించెన్,
మన మనుమతించు ధర్మము
తనదను నమ్మిక యేడదను దనువడ జేసెన్ 589

అనవుడు తల్లి యూరడిలి, యార్తిని గ్రక్కగలేక, రాజు నే
మనగల శక్తిలేక, పతి యాశ్రవమున్ గని గద్గద స్వరం
బున ననె - నే గరిష్ఠు నడపున్ మొగమీయనంటి, నం
తె - నిను విదుర్చగా దలచితే - స్వజ! పుర్వులకూరకాడగన్ 590

కన్నా యింతటి కోపభారమున ఛీత్కారమ్ములన్ జేసి తీ
విన్నేళ్లెవ్వరి కెవ్వరో తెలియలేవే? తల్లి నై నీ సుఖం
బున్నే నెల్లపుడాశ జేసెద, నిజంబున్ నేర్చి యీ తల్లికిన్
బన్నాగంబున భాగమందువె, సుతా! వ్యాపారమున్ జేతునే? 591

పదము గదల్చునంత సహపాఠి యొకండు హఠాత్తు జేర రా
బ్రిదిలిన స్నేహబాష్పకణ భిన్నము బంచుచు గౌగిలించి 'యీ
యదుకని వేళ నీ విచట నావురు మంచు బ్రియమ్ము బల్క నీ
హృదయము నా యెడంద - సమరీథను బొందవె - యూరడిల్లుమీ! 592

అనుచు బుజముపై తన చేతి నునిచి, పొగులు
చున్న నులివేడి కన్నీరు - చుక్క చుక్క
తనదు కొనవ్రేల దుడుచుచు ననునయించె
మిత్రు నా శునశ్శేపుడు - మృదువుచర్య! 593

అనురాగంబున హెచ్చుతగ్గులిడి యన్యాక్రాంతమున్ జేతురే
యనుచున్, లో గలగన్, గలంత మది దైన్యానాథు గావించ; జే
సిన సంభాషణ క్రుంగజేయగ, శునశ్శేపుండు - దిక్కుల్ గనెన్,
దనకై వేచిన యంబరీషు గమనార్థం బర్థవంతంబుగన్.... 594

ఒక వంకన్ మునిబృంద, మింకొకట తక్కుంగల్గు నావాసు, లిం
కొక వంకన్ సహపాఠివర్గములు, బుణ్యోదార వృద్ధుల్, గురుల్,
ప్రకటోత్పాతముగాంచి మౌనులయి పోవన్ - దుఃఖ కూపమ్ము నా
సికలన్ దాల్చి, గళమ్ము గట్టుక శునశ్శేపుండు చింతాకృతిన్ 595

ఉన్నవారితో ముడివేసియున్న బంధ
నాల విడదీసికొనలేక నట్టుగొట్టు
తెఱవ తెఱగున  నిలిచి భీతిల్లి నపుడు–
చిన శునశ్శేపు ననదగు – 'జింత చెట్టు'! 596

అనునీతుండయి త్రోవజూపె ముని, రాజ్యాధీశుడున్, సైన్య, మా
వెనుకన్ బాలుడు సాగి రత్తఱిని నుర్వీభృత్తు డెందమ్ము – మో
దనమున్, శంక, మనోరథంబుల వియద్గంగా సరస్వంతమై
ఘనకల్లోలము నందు జిక్కి; గదలెన్ గైకట్టు తొండాడగన్ 597

అశ్వగతి
వారటు సాగిరి నాశ్రమవాసులు నిల్చి, సమా
చారపు జర్చకు బూనిరి, సారవివేకములున్
సారెకు సారెకు వృత్త విచారము లోగొనగన్
వారుణి సూర్యు దుపాస్తికి వారిధి వ్రాలెనటన్ 598

వృక్షము లోటమి జెందుచు వెన్కనె నిల్చెను, రు
ద్రాక్ష తరుల్ తలవంచుచు రథ్యల వీడెను, తా
సాక్షిగ మారె దటాకము జాలిగ నిశ్చలయై
పక్షుల పాటలు గూర్చెను ప్రాకృత రాగములన్ 599

స్యందన వేగము దుమ్మర సాలువుపుంబదటున్
బొందుచు సాగెను; సాగెను– పోడిగ చీకటి – యం
దందున దోడ్కొను నేస్తమునై కదలన్ – నృపుడున్,
బొందిక బాలుడు – విక్రియ పోకడ వేసరుచున్... 600

దారి బుష్కర తీర్థమ్ము జేరినారు
మౌని కౌశికు దర్శించి మాట గలిపి
జరుగుచున్న వృత్తాంతపు సరణి దెలిపి
నేల చూపుల జూచుచు నిలిచినారు. 601



ఆపయి గౌశికుండు ప్రియమారగ బాలుని జేర రా గర
మ్మూపుచు బిల్చె నంత; నత దుత్తరు వియ్యకొనంగ మౌనియున్
జూపుల సంప్రహాసము వచోనిపుణత్వము, బల్కులందునన్
జేపడ; సౌహృదం బనువుజేయుచు వాకొనె నిట్లు తీయగన్ 602

'ఏరా యల్లుడ! యెల్లరున్ సుఖులె? మౌనీశుండు; మా చెల్లియున్
సారాచార  వివేకవర్తనులు, సంసార వ్యథాత్యక్తులౌ
వారున్ వీరును, నీ సహోదరులు, మీ బాంధవ్య వర్ధిష్ణులున్;
బోరామిన్ దలపుల్, మనస్సులను జూపుల్ నిల్పు వారందరున్ 603

నాకిది చోద్యమై పరగు, నాయన రాడు, నృపాలుతోడ నీ
వీ కరణిన్ భయం పడుచు నేదియొ బాధ్యత తీర్చబోవు యే
కైక వతారి వోలె నయగారము జాటుచు వచ్చియుంటివే –
వేకరమేమి లేదుగద; వేగమ జెప్పుము మేనయల్లుడా! 604

అనుచున్ భీతిని ముట్టి యాడు ముని వాక్యాలాప సందోహముల్
వనపున్ గొంతుకు దట్టి నిల్ప, నొక భావప్రాప్త మౌఖర్య మా
తని వేధించెను డెందమందొకటి యంత్రాంతర్గతంబైన కీ
లును నాన్ రాపిడి ఏపరించె, సుఖ మూలోచ్ఛేదమైనట్లుగన్ 605

సెగ నిట్టూర్పుల నూర్పులన్విడి – శునశ్శేపుండు – దుఃఖంబు వీ
చగ, వాక్యంబు బెకల్చుకొంచు ననియెన్, సంతృప్తి సిద్ధించె– మీ
వగు మాటలన్ విన; దల్లిదండ్రులకు రేవండైన నిర్భాగ్యు మీ
దృగకల్కన్ దనువొంద జేసితిరి నా ద్రిక్కున్ విచారించుచున్ 606

కన్నపేగని పట్టంబు గట్టుకొనుచు
ప్రేమ పేరును పైకెత్తు పెద్దలెల్ల
వారె త్రాసు నిల్పవలసి వచ్చినపుడు
మ్రొగ్గు తమవైపు జూపగ మ్రుచ్చిలింత్రు! 607

కన్నప్రేమయు మఱి పెంచుకొన్న మమత
బెండు మాటల జేయుదు; రెండగట్ట
గలరు - పెనవేసికొన్న రాగలత; కంట
నీరు వేరది - మొసలి కన్నీరు వేరు! 608

నిజమొకటి; మఱి యొకటి భేషజము గాదె!
సర్వమెరిగిన వారుగ సంఘటించు
వారె పప్పులో కాలిడ వక్రతములు
నిప్పుకే బుగులు గొనమ్ము తప్పలేదు!! 609

సకలము తెలిసిన తాపసు
లకు దెలుపవలెనె స్థితిగతులను నేనై - పి
చ్చుక ప్రాణమునకు జాలదె-
యొక బాలుని కముచు దెబ్బ - యుద్వాసనకున్ 610

మునివర నేను - దుస్థితిని ముచ్చిరి యుంటిని; కార్యకారణం
బును నరపాలుడే నుడువ బూనుట భావ మనంతరమ్ము - వా
గనుసరణమ్ము జేతు క్షతగాత్రుడ గావున; మీరు మీదు - నె
మ్మనమున కేది న్యాయమొ సమస్తము దూచియు జేయ వేడెదన్ 611

ఆశలు లేవు పెక్కు లడియాసలు గోరను, దేహమిచ్చు సం
దేశ మెఱుంగుదున్; గల తితీర్ష వచింతు - క్షితీంద్రు యాగ సం
వేశము దీర్చి నాకు మదభీప్సిత యోగ్యతపఃప్రయత్న ప్రా
ప్తాశయ స్వర్గవాస వరదానము నిందు - సమర్థులౌ కతన్ 612

ఆ శునశ్శేపు బ్రార్థన మాలకించి
గాధితనయుండు దలయూచె, గాంచె నృపతి,
నంబరీషు దుదంతమ్ము నంత దెలిపె;
ముఖ కవళికలు మారగ మునియు నంత; 613

శిరమున్ ముద్దిడి ముట్టనాడుచు శునశ్శేపున్ ప్రపన్నాత్ము స
త్వర రక్షా విధి దానుబూని నియమావాప్తంబునౌ బాస, భా
స్వర దీక్షారతి సంజ్ఞ బాలుగని, విశ్వశ్రేయమే లక్ష్యమౌ
వర సాహిత్య కళాప్రవీణుడగు - విశ్వామిత్రుడే యిట్లనెన్ 614

జరిగిన దంతయున్ దెలిసె; జక్కగ జెప్పితి వీవు; పేరుకున్
వరముని తండ్రి; తల్లి - యొకపావని; యగ్రజుడున్ వివేకి - భా
సురమగు చిత్తవృత్తియు విశుద్ధ మనమ్మును గాని లేవు, యీ
సరవిని నెల్లవారలు విచక్షణ వీడిరి యెగ్గు జేయుచున్ 615

వేడుక - చుట్టముల్ నడుమ వెంగలి, పోరు ముగింపునందు వె
న్నాడిన పోటుగాడును; కకావికలయ్యెడు బంట్లు, పెండ్లిలో
కూడని కూతలిచ్చు పసికూనల చర్యలు! యేమనన్ వలెన్ -
పీడయు, కీడు, చేటునిడు బీడును, కాడును, పాడనన్ వలెన్! 616

అట్టి పోలిక తగును కాలాంతకులకు
నీదువారికి; చేత తూనీగబట్టి
చిదుమ బోవుచు గేరింత జిలుకు తత్త్వ
మెఱుకబడియె; వారి యెడద లిరుకుటిళ్ళు! 617

పాడయినట్టి దేవళము ప్రాంగణ మందున రంగవల్లికల్
వేడుక మీఱ దీర్చుకొని; వీక దలిర్ప మహోత్సవమ్ము లం
దాడుకొనంగ బూనుదుమె? యట్టిదె వారికి జెప్పు పూన్కి; చే
కూడెడు మేలు దెచ్చి యొనగూడు ఫలమ్మును నేనె యిచ్చెదన్! 618

సందియ మన్నదే వలదు, సద్గుణవంతుడ మేనయల్లుడా!
ఇందరు నొక్కటై తెగడి యిట్లనుపన్ నిను వీడినట్టి యీ
చందము - నా కసహ్యము నజాత్య మవాప మవాంతరమ్ము; నీ
వందుము దీవనమ్మభయ హస్తము - నీకు జిరాయువయ్యెడిన్, 619

అనుచు మహిత పుణ్యు దత్యంత హితమతి
నియమ వర్తనాఢ్య నిశ్చితుండు
గాధిసుతుడు లేచె గనులెఱ్ఱ జేయుచు;
పిలిచె సుతశతంబు; వినిచె – కోర్కి 620

శరణనియె శునశ్శేఫుడు
సరియని నేవానికి నభయ సంగతి నిడితిన్
గరుణను మీలో నొక్కరు
పరహితమై క్ష్మారమణుని పరమై వెడలన్.... 621

రావలె ముందుకు – జనకుని
సేవాధర్మము, ఋణమును, జిరకీర్తి ప్రభన్
మీవలె గాపాడెడు సమ
భావులు, నుత్తములు మీరె, పనుపరులనగన్ 622

యాగ సంపూర్తి కొఱకు నియ్యంబరీష
నరపతియె కోరుచుండెను – నరహయమ్ము
కావలసివచ్చె, మీయందొకడు జనవలె
నిలుపగావలె నామాట నిక్కమవగ! 623

అందఱజూచి మౌని యిటులాడగ బుత్త్రుడౌ హవి
ష్యందు డపావృతంబగు విచారపు నవ్వును నవ్వి తండ్రికిన్
వందనమిచ్చి ధీరముగ వాకొనె – 'మీ తలలోని నాల్కలై
యందఱమున్ సమైక్యత  పదార్థము నాన్ మనుచుంటిమే గదా! 624

రపమౌనంచిటు కట్టె ద్రుంచి పోయి బాఱన్వేయు యత్నంబె? యే
విపరీతంబిది  గొప్పకోస మిటులీ విన్యాసమున్ జేతురే?
విపణమ్మున్ సరియంచు స్వాత్మజు మనోవీధిన్ తొలంగించు – మీ
యుపకారోపచయమ్ము నేమనవలెన్? యోజించ నౌత్సుక్యమే! 625

ఎంతటి గొప్పతండ్రి! కొడుకెవ్వడొ యక్కరలేదు; నూర్వురుం
దెంత యొకండు లెక్క? సరియే! కన శాత మదొక్కటౌను; యే
చింతకు దావులేక యిటు సిద్ధముగాన్ గొరడా విదల్చి రీ
వింతకు వంతులేదు; మనవిన్, చనువున్, నెనరున్ హరింతురే?! 626

ఏమి యుదారతా గుణ మదెంత కృపాఘన మెంత న్యాయమో–
సేమము శ్రేయముల్ పరుల చీలికి బీలికి గట్టబెట్టి మీ
రీమెయి స్వచ్చరిత్రమునకే తలకట్టును గూర్చుకొందురే?
మీ మహనీయ కీర్తికి నమేయ పురస్కృతులందగావలెన్. 627

చాపక్రింద నీరు చల్లగా దెచ్చిరి
తేనె పూసి కత్తి దించినారు
కొఱవినిచ్చి తలను గోకు కొమ్మనినారు
మెత్తని పులి యగుచు మిత్తినిడిరి! 628

అన దృఢనేత్రు డందుకొనె – నాపయి నందఱు నొక్కటై యదే
పనస ననేక రాగముల బాడిరి, వాకొని, రాడి రంతటన్ –
జనకుని గుండెమీద నొక సమ్మెట వేటును వేసి – ధర్మమున్
పనిచిరి, 'మీ యనుజ్ఞ గన శ్వానపలమ్ము భుజించినట్లగున్' 629

అటునిటు నీవిధిన్ గటికి మాటల యీటెల పోటులన్ గనన్,
జిటపట కిన్క పేలలట జిట్లగ, బెట్లగ మౌని – గాటమౌ
పటపట పండ్లునూరి పరిపాటగు మాటల వీట తాటన
మ్మటమటకాగ, రోషమొక యారట నింపగ, మాటవ్రేటునన్, 630

అనియెను, 'బుద్ధిహీనతయు నారభటీపరినిష్ఠ హెచ్చె, మీ
జనకుని మాటయన్న నొక చక్రికయయ్యెను; పెచ్చుమీఱుచున్
చెనటుల మందగా నిలిచి, చిందులు ద్రొక్కుతు దుష్టభావ మం
తనముల జర్చజేతురె – నిదానము వీడుచు రచ్చకెక్కుచున్? 631

పాపము బుణ్యమున్ మఱచి జ్వాలరగిల్చితి రిందఱేకమై
మీపితృభక్తి, మీ తెలివి మీరిన తిక్కయు చట్టుబండలై
చూపులు నెత్తికెక్కెను; యశోమయు, వంద్యుని నాకె నీతి బో
ధా పరమార్థమున్ వినిచి దబ్బర దెచ్చితి రింక జెల్లునే! 632

ఇది క్షంతవ్యము కాదు కాదికను, మీ యీ పోకడల్, వాదముల్
వదరుంబోతుల మాటలన్ వినను, సర్వానర్థమున్, స్వార్థమున్
విదితంబయ్యెను - భ్రష్టులార! యిలలో వేయేండ్లు జీవించు డా
పదలన్ మోయుచు గుక్క మాంసమది తృప్తాహారమై బోవగన్. 633

మదిలోనన్ గఱ, మాగు మెక్కొనెను; గుంపై కష్టముష్టింపచుల్
గదియన్ రోయుచు మైలబట్టలయి నిగ్రాహమ్ము మైదాల్చి - పొం
డిదియే మీకగు శిక్ష! బాలు తల నే నేరీతి రక్షింతునో
పదిలంబౌ స్తుతినెట్లు చూపెదనొ మత్ప్రాబల్యమున్ గాంచుడీ. 634

మీరున్ వాసిష్ఠులవలె
దారున్ దీరును దెలియక దారుడు - నిరతం
బారాటపు బుండు సలుప,
నారసమై నాదు శాప నాగము తఱుమన్ 635

మొగముల్ జూపక బొందు పొందనుచు దా ముక్కోపియై నూర్వరన్
దగలన్ ద్రోసెను - క్రోధకీలలును ఛీత్కారమ్ము పూత్కారముల్
రగులన్, బాలుని దగ్గరించుకొనుచున్ - రక్షాబంధ సంబంధిగన్
వగచెందెన్ - ముని; బాసనిల్వ - దరణోపాయంబు యోచించున్ 636

ఇక నీ కార్యము దీఱు వత్స! ఇవియే యీ మంత్ర మాహాత్మ్యముల్
సకలార్థాన్విత భావశక్తితతి - నిన్ - సంరక్షజేయున్, సమ
గ్ర కటాక్షంబును నీకు నిత్తు - వరమంత్రంబుల్ మఖాంతస్థ పా
వక సామీప్యమునన్ పఠించి నిలుమీ వంతల్, వ్యథల్ దీఱగన్ 637

నీకుం దీఱును గండ, మీ నృపునకుం దీఱున్ మనోవాంఛ; త్రై
లోక స్తుత్య మహత్వగాథయగు - నా లో చూపు, దీంద్రల్, దిటల్
లోకాలోకిత లోకసంగ్రహము - స్వర్లోకార్థివౌ నీ కికన్
జేకూరందగు నా తపః ఫలము సుశ్రీ లెల్ల శ్రేయంబులున్ 638

అన శునశ్శేపు డానంద మంది, నుతుల
నతుల నిడె; నంబరీష భూనాథు డతుల
సంతసమ్మందె; గౌశిక సంయమీంద్రు
డానతీయ సెలవుగొని రాప్తరీతి. 639

ఆపయి నిర్వురున్, ద్వర, మహాధ్వర శాలకు వచ్చి జేరగన్-
యూపము జేరినిల్చి వినయుండును - బద్ధుడునై, సహించి, దై
వోప బలార్థి యయ్యె, సమయోచిత మంత్రము లుచ్చరించె; దా
నేపున నింద్రునిన్ మఱి యుపేంద్రుని దృప్తులజేసె బాలుడున్. 640

సిలుగున్ దీర్చెను - జంభభేదియు - జిరంజీవీ! యటంచాతనిన్
బలమౌ దీవెన ముంచె; మౌనివరు విశ్వామిత్ర విద్యాతపః
ఫలశృంగంబునకున్ విధేయతల సర్వస్వమ్ము గైసేసె, యా
గ లలిన్ క్ష్మాపతి యంబరీషకొసగెన్, గారుణ్యమేపారగన్ 641

## విశ్వామిత్రుని తపము - జారుడు మెట్లపై నడక

పిమ్మట విశ్వామిత్రు డి
హమ్మున జరిగిన విశేష హవములు జాలున్
బొమ్మనుకొని వేయేండ్ల త
పమ్మును తలచెను జగత్శివపరాయణుడై! 642

తపమున్ దీక్షను బూనె గాధిసుతు దుద్యత్ప్రౌఢిమన్ జిత్త శు
ద్ధి పరిక్షేపము వాంఛజేసి; భయముల్ దైవాఱ బృందారకుల్
విపుల క్షేమము గోరి మేనకను పంపించన్ దపో విఘ్నమై,
అపరాద్ధాచల సర్వకమ్ము సుతనీయన్ మౌని దుఃఖార్తుడై, 643

ప్రణిధి నెన్న దతపోహృతి కారణమ్ము
నెమ్మి గ్రహియించె, దా నింద్రియమ్ములను జ
యించు గాడేచ్ఛతో దీక్ష మించనెంచె
రంగుల వల దగలుకొన్న రంత మరల... 644

తా దపశ్శాఖి జేరె సందర్భమెఱిగి -
కల ఫలించె, విధాత సకల మెఱింగి
దర్శనమిడ, "మహర్షి" గా స్పర్శనమ్ము
గలిగె; మౌని యతృప్తుడై కలత జెంది, 645

ఉరునిష్ఠన్ ఘనదీక్షలన్ గొని దపంబుగ్రంబుమై జేయు నా
వరమౌనీశు బరీక్ష నిల్ప సురలా వామా మణిన్ రంభ దిం
చిరి రంగంబున; కౌశికుండు విరమించెన్ దీక్ష - వెన్వెంట లో
బరికించెన్ గమనించె, గ్రోధమున రంభన్ రాయి జేసెన్ ద్వరన్. 646

త్వరపడి తాను జేసినది తప్పిద మంచెఱిగెన్ మునీంద్రుడున్
దరతరమున్ దపం బిటుల తామస కారణమై చెడన్ - జిదం
బర ముదిరం బదెప్పు డిక వర్షపు హర్షము దెచ్చునంచు - నా
తురతను బూర్ణ దీక్ష గొనె దూగులు నూగులు వీగిపోవగన్ 647

దమము విస్తృత మయ్యెను, క్షమయు నమన
మయ్యె; బాహుళ్యమై నిండె - యమము; మనము
సంయమనము జేసె- కఠోర సంయమమ్ము;
సర్వ సంపూర్ణమయ్యె నిస్సంగ నిరతి! 648

అంత బ్రహ్మాదివరులు ప్రత్యక్షమైరి
గాధిపట్టికి 'బ్రహ్మర్షి' గ్రథనమీయ,
వాంఛ జేసె - వసిష్ఠుడే వచ్చి నిలిచి
పరమ "బ్రహ్మర్షి" పదమీయ వలయు నంచు! 649

పీడకలలన్ని చెదరిన విధము - కుశిక
జాతు చిరకాల వాంఛ నిజమ్ము జేసె-
ముని వసిష్ఠుడు వచ్చి; ఔననుచు మెచ్చె -
దెఱవు నెఱవును నెనరును దేజరిల్ల! 650

జారుడు మెట్లపై తపము సర్వము నాటగజేసె, లోక సం
స్కార హితార్థియై నిలిచె గౌశికసూనుడు, తత్ప్రతాపముల్
నేరమె? పట్టువీడి మననేరడు, మీఱడు మాటనిచ్చి, వి
స్ఫార యశస్కుడై నిలిచె సాంద్ర వికాస విభూతి జాటుచున్! 651

కారణజన్ముడై బురషకారము వీడక ముందుకేగె నీ
తీరున దీరులేని బహుదీక్షల, పేరున నూత్న పాఠమై
మారెను, పట్టు పద్దులకు మాఱటయయ్యె మహోగ్రమయ్యె నీ
పౌరుష రాజసింహ మనివారిత తేజము పూజనీయమై! 652

అంతటి కంతవాడు కుశికాత్మజు డో రవివంశచంద్ర! మీ
యంతటి వారి కా యతి మహా మహితాత్ముల పూర్వగాథల
త్యంతము పాత్యముల్ తతమయాచిత భూతిగ నే వచించి నా
నెంతటి భాగ్యమో యిది - సమీక్షణ మాత్రమె ధన్యతన్ గనన్! 653

అని శతానందుడు దశరథాత్మజులకు
వినిచె గాధేయుగాథ సవిస్తరముగ;
చలువ చీరెల జుట్టిన చాయవలన
రాఘువుల మానసమ్ముల రాగమయ్యె! 654

పలుకునకన్న భావమున వాడిమి గుండెకు బట్ట, రాఘవుం
డలమిన గారవంబున నహార్య ధురంధర ధీరమూర్తినిన్,
నిలిచి వెలుంగు ధైర్యఘృణినిన్, ఋషిసత్తము గాంచి, నమ్రతాం
జలి ఘటియించి యిట్లనియె; సాజము పొందిక ఛాత్రపాత్రమే! 655

చలమున నిన్ని కార్యము లచంచల దక్షత నిర్వహించి, యు
జ్జ్వలమగు మీ తపోబలము సర్వము నిట్లు పరోపకారమై
పలుమఱు వెచ్చపెట్టి యెటువంటి విచారము లేని త్యాగులో
యలఘు మనీష! గాధితనయా! జనవంద్యులు మీరు నిచ్చలున్! 656

వితత శాస్త్రాబ్ధికి గడలు వెట్టినట్టి
ఆ శతానంద సంయమి నర్చజేసి
దశరథాత్మజ ద్వయము కదలిరి – గాధి
తనయు వెంట, విశ్రాంతి యుదవసితమ్ము! 657

## ఆంతరంగిక సుఖగోష్ఠి – తలపోతలు

ఆకసము భూమి కలిసిన యంతికమ్ము
నుండి యొక క్రమవృద్ధి సూర్యుండు లేచె
నతి వినయ నియతి దిరిగె నరుణభక్త
చక్కటి కొడబడును గాదె జ్ఞానమెపుడు! 658

అదిగో మైథిలు నాంతరంగిక గృహమ్మచ్చోటనే భూపు డ
చ్ఛదయాప్యీతుడు గాధినందనుడు భాస్వంతాన్వయుల్ గూడి ర
భ్యుదయాకాంక్షను, పిల్చినారు కృతపుణ్యున్ గౌతమక్షేత్రజున్
గదిలెన్ వేడ్కగ ముందువెన్క సమయోక్తవ్యాహృతాసంకథల్ 659

ఒక గాంభీర్య విచిత్ర రేఖ ముఖమందోంకారమై నిల్వ, న
చ్ఛకళాసాంద్ర కథావిశేషమనియెన్ క్ష్మాజాని – భూకన్య జా
నకి జన్మంబు, గిరీశ కార్ముకము, నానారీతులన్ దాను ర
క్షకుడైనట్టి విధంబు – శ్రోతల జిఘృక్షాకాంక్ష వర్ధిల్లగన్ 660

ప్రాణము లారబోసి యనురాగము జల్లితి, శ్రద్ధబోసి, యీ
క్షోణిజ బెంచుకొంటి; శుభశోభలు వర్ధిలె, సీతనున్ మహా
త్రాణమువోలె నుండిన శరాసనమున్ బరికించ నాకు – వి
న్నాణమునందు రెంటికొకనర్మము, సఖ్యత తోచె – వింతగన్ 661

నయవినయ సహజ – సహజ – నా కుమార్తె
పంచభూతమ్ము లొక్కటై వరలినట్లు
మానవంతునకు యశమ్ము మాడ్కి దొరకె
శోభలకు లోకమే సిరిజోత లిడగ! 662

కన్య, రూపనిర్జిత సుగుణాన్య – సీత
మాకు ముంగిటి ముత్యంబు మైథిలియన
కుందనపు బొమ్మ ధనికగా గూర్మినింపె
తేజము విలసత్ సమరేఖ దీప్తి నొసగె ! 663

ఒక కాత్యాయనివోలె, లక్ష్మివలె, లోకోత్తంసుదేవేరి నాన్
సుకళాశోభితమూర్తియయ్యె, సుషమాస్ఫూర్తిన్ స్వరాంతర్గత
ప్రకృతాభావక భావమట్లు మధుర ప్రాగల్భ్యమందించె – జా
నకి మావారికి, మాకు గూడ, బ్రజ యానందించి దీవించగన్! 664

అటుపై సాజము లోకరీతియు వివాహాచారయత్నంబు, లు
ద్భట కోలాహల ముప్పతిల్లె, సమయప్రాధాన్యమున్ జర్చ జే
యుట, మాట్లాడుట, పెద్దలే జరిపి రుద్యుక్తాభిలాషస్పృహన్,
బటలీసంభ్రమ మెప్పుడైన జొరవన్ బాటించు నీ పోకలన్! 665

కనుదానిన్ వినుదాని నెంచితిని దీర్ఘాన్వీక్ష; నా మానసం
బనె నిర్ధారణ, వీర్యశుల్క సుత యంచాభావమున్ జాటితిన్,
పనితోగ్రాక్షు మహాశరాసనము నెవ్వాడెక్కు బెట్టంగ నో
ర్చునో వాడే ధరణీజ జేకొనునటంచున్ సంభవత్స్ఫూర్తితోన్ 666

ప్రకటనము పెనుగాలియై పర్యటించె
జగతి, యుక్తులును కుయుక్తి చక్రమెల్ల
భ్రమరి తిరిగె – లోకముల వ్యాపనము జెంద;
గుడిచి కూర్చున్న వారెల్ల గోరి రామె! 667

అట్టిటులైన వారు విఫలాతురు లైరి, విరోధులైరి వే
ముట్టిరి మమ్ము, నీ మిథిల, ముమ్మరమైన ప్రమాదముల్, వ్యథల్,
జుట్టు కొనంగ వత్సరము జూవరమందున జారె, నాపయిన్
బట్టితి దీక్షయున్ దపము, పట్టిన బల్మిని వారి గొట్టితిన్ 668

దివ్య మమోఘమౌ ధనువు – దీని కవీర్యులు, భీరులు, నల్ప వీర్యులున్
సవ్యము సహ్యమైనవిధి జ్యా యొనగూర్చగ లేక పాఱగన్,
భవ్య తరస్వి యొక్కడు సభాజితుడై సకలావనీ ప్రజన్
నవ్య సమీర హేళిని నందుల జేయగవచ్చు నీయెడన్– 669

అనునొక యాస గుండె యరలానగ నిల్చితి, విన్నవించితిన్
పనివడి మిమ్ము బిల్చుట, శుభంబని మీరుననుగ్రహించుటల్
గనుగవ ముందు పెన్నిధిగ గల్గిన దీ యవకాశమో – మహా
త్మ! నను ఫలాప్తికిన్ నడుపుమా – తమ చిత్తమె మాదు భాగ్యమౌ! 670

తరళము నర్థభావ సహితమ్మును భావన మంతరంగమున్
దొరల విధేయతా గుణముతో మిథిలాపతి వాకొనంగ, మున్
జరిగిన దంతయున్ దెలిసి సంయమి కౌశికుడాసనంబు డి
గ్గి రుచిర కావ్య ఘట్టమున కీలకమెంచి, వివేక విశ్రుతిన్... 671

అటునిటు మెల్లగా నడుగులాన్చె, యథాయథలైన ఊహలన్
జిటుకున మేళవించుచు విచిత్రపు భంగిమ జూపె, నాగె, న
చ్చట నొక ప్రక్కగా గనుల జల్లగ నీడుచున్న చిత్రమౌ
పటములు కుడ్యచిత్ర సమవాయము జూచుచు నిట్లు వాకొనెన్! 672

అదిగో సీత! వయస్యలందరరుగో యన్యోన్యమౌ పొత్తుచే
'నిదిబాగున్న, దదేమొ అద్దము, యిదేమీ? దీని నావైపునన్
బదిలంబేర్పడ జేర్చు'డంచు సకలంబౌ వస్తు సంబారమున్
గదియుం జేయుచు' వేడ్కలన్ మునిగి రేకాబంధసంబంధులై! 673

అగుచో, సీతయటన్న పల్కు శ్రుతికాహ్వానాప్తసల్లాపమై
తగులన్ వారు కృతావధానులయి యేతత్ప్రాంత వైచిత్రి జూ
డగ నా వైపుకు సాగ, గాధిజునకున్ డాపై విలోకించె – దా
నగవున్ జిందుచు రాఘవుండు, ముని సంభాషించె నాపై నిటుల్ 674

కుడిచేతన్ బువుబంతి వేరొకట మేల్ గోలాటపుం గఱ్ఱలున్
గడకన్, బాదము నేలపై నిలిపి సంకల్పమ్ము నూతమ్ముగా,
విడిపోనీయని నీవి జుట్టుకొని, తన్వీరత్న మౌ సీత యా
డెదు నాటల్ పలురేఖలయ్యె – లలి జాటించెన్ మహాదృశ్యముల్ 675

ఇటు కనుడు మరియొక చిత్రమెంత సుంద
రము, సురుచిరము – ముచ్చటలు, మురిపాలు
నాటపాటల కన్యల నాశ్రయించె
రంగురేఖల రూపొందె రమణ రచన! 676

అదిగో వాహనమష్టచక్రకృత మార్యానాథు కోదండ మ
య్యదె కాన్పించుచునుండె, నుద్ధత మహత్వాశాంత దంతావళా
స్పద భూభారము సర్వమేకమయి యష్టశ్శుండముల్గూడెనాన్
దదపూర్వా పరినిష్ఠితస్థితి సముత్కర్షంబు వర్ధించెడిన్ 677

చిత్రము చెప్పుచున్నదిట చిందులయాటకు నడ్డమయ్యె నం
చా త్రిపురాంతకున్ ధనువు నక్కట! ప్రక్కకు నెట్టె సీత, యే
మాత్రము భారమెంచక, క్రమంబగు సంఘటనమ్ము గాంచి యా
మిత్రవయస్య లెల్ల గనుమీ యని యట్టిటు సంభ్రమించగన్! 678

అని యొక్కించుక నాగె గాధిజు దహల్యాసూనునిన్, రామునిన్
గనె – సామీప్యము నందు గల్గు మతియొక్కండైన చిత్రంబు జూ
పె, నమోఘంబగు ఘట్టమెల్లను కళావిర్భావ సంస్థానమై
మనుపన్, సంతసమంది వాకొనెను సన్మాన్యత్వ మొప్పారగన్ 679

అక్కట మిక్కుటంబయిన అత్తర ముత్తలపాటునిండ పెం
పెక్కిన డంబుతో నృపులు పృథ్వీసుతన్ వరియించు కోర్కె తా
మొక్కరి హక్కుగా గరిమ ముబ్బగ జేయుచు నీక్షణంబులన్
జక్కదమున్ బహిర్గతము సల్పుచు గూడిరి రాట్సభన్, ప్రభన్ 680

ఒక్కరి వెంట నొక్కరుగ నుత్సవమేర్పడ చాప భంగమున్
చక్కటిజేయు యత్నమున శౌర్య సువీర్య విశేష భేషజ
మ్మక్కడ వీగ, భంగము, ముఖానతి ముంచగ, జంకుగొంకులన్
జిక్కినవారు – బీరములు సెల్లక జయ్యన బాఱుచుండగన్! 681

జనసమ్మర్దమదెల్ల హాస పరిహాసంబుల్ రేగగా గేరుచున్
తని కర్ణమ్ముల గాంచి త్రుళ్ళి తమలో దామందరేకమ్ముగా
'జనక క్షోణిని మెట్టునట్టి ఘనునీ సామంత సంధాతలన్
గను భాగ్యంబది లేదు మా' కనుచు దిక్కామోములై యుండిరే! 682

అనుచు నా చిత్ర దర్శన మాపె మౌని,
వెనుతిరిగి యాసనము జేరి విభుని కనియె
రాఘవుల ధనుర్దర్శనారభటి వినుము
రాణ తత్సముత్సాహమారంభ మగుత. 683

సీతయు, ధనువును – మిథిలకు
ఖ్యాతిని గూర్చిన విచిత్ర కారణములు, చి
త్రాతిశయమ్ములు గన మీ
సీతయొక ప్రతి యిడరాని చెలువగ దోచున్! 684

అందుకె యింతదనుక నీ
యందపు సందర్భము – తమ యాంతర్యము మా
కందఱకందె ప్రజావళి
కందుట కింక దఱియయ్యె నద్వంద్వ నృపా! 685

రానున్న ఘటన సూచన
తానై ఈనాడె ముందు తళతళమనగా
నానందపు సంగతియే
కానున్నది రేపటి శుభకార్యంబధిపా! 686

చక్కనైన చిత్ర చయమున నరసితి
జక్కనైన పనులు చాలుబడియు,
జక్క నగును పూన్కి, నిక్క మవనినాథ
జక్కదనము జేరు జక్కదనము! 687

అను శుభాకాంక్ష దెలిపిన ముని వరీయు
దెస గృతజ్ఞత దొణకెడు దృక్కుబఱచి
'రాత్రి మించెను మీకు విశ్రాంతి వేళ –
ఇంక సెల' వంచు ననిపె మౌనీశు – ప్రభువు! 688

అనఘ ఋషిచంద్రు సుస్వచ్ఛతాభికాంక్ష
వోలె ధరణిపై చంద్రికల్వోసె – రాజు
తరువు చిగురించు సుందర తర మనోజ్ఞ
దృశ్యము గనులందె తపసిన్నగవు కపుడు! 689

మధ్యాక్కర
అతిథి గృహమ్మునన్ దినకరాన్వయు లిర్వురు గూడి
కృతపడినట్టి ఘట్టముల ధృతి బరామర్శము జేసి
స్తుతమతి గాధిసూనుని వచోవిభవంబును, జిత్ర
శతము గుఱించి సంగీతి సరములల్లుచు గూరుచుండ 690

తన జ్ఞాపకములు మదిలో
ననె సుడివడ రామమూర్తి – నరపాలుండీ
ముని కిడిన విన్నపము వి
న్ననువును సింహావలోకనము జేసికొనెన్ 691

నాడు ప్రత్యక్షమున తాను చూడకున్న
జరిగిన విశేషము హృదయ సన్నిహితము,
నాడు తాను వినని కథనమ్ము నెఱుగు
మనము – సర్వార్థదాయక ఘనము – నిజము! 692

కనులముందయోధ్య కదలె, భావస్పర్శ
తడవె – తండ్రి దశరథక్షితిపతి
గాధిపట్టి మధ్య గదరిన వడగాలి;
ప్రణిహితకథ దాకె రాము మదిని! 693

ఈ గతి నొక నాటక దృశ్య మేర్పడంగ
పితరుని విలపనము కనిపించె, నికము
శ్రీనింపె; రాఘవు కన్జెమరింపు మిగిలె;
క్షణము యోచన మారె వీక్షణము మారె! 694

**శ్రీరాముని మధుర భావలహరి**

కలతనిదుర రాముని మది
బిలిచెన్ లలి గుద్య చిత్ర విగుణము – ఘట్టం
బలకనితెల్విని ప్రియ మై
థిలియె మధురభావన మయి తిరుపులు గట్టెన్ 695

అతను మోహనాస్త్రమ్ము, సుధాంశురేఖ,
కాంచనోజ్జ్వల ప్రతిమ, సత్కళల ప్రోవు
పదతి రత్నశలాక, ప్రవాళ మాల;
మంచు దడిసిన ఒక చుక్క మల్లెపూవు! 696

కళలు సకలము నొకచోట గనగవచ్చు
ననగ నొప్పులకుప్ప, నిక్కంపు నీల,
ముర్వి బర్విన వెన్నెల – సర్వమంగ
ళాభిరామయై తోచె బాలాకుమారి! 697

పదనున దలిరెసగు నందివర్ధనంపు
కచ్చు – కనిపించె; వెరజాడు కమ్మతెమ్మె
ర – తలపించె; నిల్చి వెలుంగు రవల దివ్వె –
కట్టెదుట నిల్చెననిపించె; గలలబంచె! 698

మల్లికా వల్లికా గిరిమల్లికా మ
తల్లికల మధ్య తాను మందారవల్లి
యగుచు భాసించె ముగ్ధ మోహనలతాంగి,
ధరణిజ! సకలమున్ బూచె ధరణిజ దరి! 699

ఆకులో నాకుగా తలిరాకు కదను,
కొమ్మలో కొమ్మగా నును రెమ్మదరిని,
పువ్వులో పువ్వుగా సురపొన్న చెంత;
నాటదోటను సీత యాటాడనిలిచె! 700

జనిత స్వేదముతో జా
రిన కస్తూరి తిలకము విరిసి, చిటిగణముల్
కణములుగ పొటమరింపన్,
జనకజ తోచె సీకరముల జల్లెడు తరువై! 701

కడమ ఫలమెదొ మధురోహ కాన్క లిడుచు
బులకలెత్తించుచుండగ – ప్రోవుగొనెను
నిశి, విభావానుభావమ్ము నింపి నింపి–
నిద్ర తడవె రాఘవుని, మానితసుకృతిని! 702

చంద్రనిభాస్యయైన చెలి జానకి భావన రామచంద్రుడే
సాంద్రతరానురాగమున జక్కగ జిక్కెను – సాక్ష్యమింక నీ
చంద్రుని కేల యంచు గడిజారె నిశాపతి; రామమూర్తియున్
మంద్రపు బుల్కు క్రమ్మగ, గ్రమంబున నిద్దురజారె – నాటికిన్ 703

## జనకరాట్సభ - ధనుష్కాండము

తనకన్న  మునుప మేల్కాం
చిన రవికులతేజుల గని చెదు బద్దకమున్
బనకుచు తురికి నదల్చెను
దినమణి - జేజేలు నగుచు దివియుచుబోవన్ 704

సమయోత్పన్నత సంభ్రమమ్మెసగ సౌజన్యాకృతుల్ బాలు రా
గమరీతిన్ సుతపాది దేవతల సంకల్పార్థమర్చించి; సం
యమి గాధేయుని యాజ్ఞవేచు తతి - నుద్యద్భాతి జెన్నాతె, జి
త్రముగా రెండు నభోవల్లికల విక్రాంతైక్యతా స్ఫూర్తిగన్ 705

అదిగో రాట్సభ! ముందమాత్యవర, సైన్యాధీశ, సామంతు ల
భ్యుదయాకాంక్షులు దేశికుల్, వెనుక సభ్యుల్, మాన్య, సామాన్యులున్
సుదతీవర్గముజేర, బ్రక్క నగరస్థుల్ నిల్వ, గ్రామీణులా?
పదముల్ మోపగ జోటులేక మొగముల్ పైపైకి నిక్కించిరే! 706

ఉదితోష్ణాంశు సమానభాసితుదు, సత్యోత్సిక్త, శీర్షోక్తి నాన్
సదమందా వసుధాపుందు - మిథిలాసంగీర్ణ సంధాత; రా
జు దరిన్ గాధిజుడా కడన్ నిలిచి రాట్పూన ద్వయంబుండగా
నదియే నిర్జర నాయకున్ సభగ జోద్యంబయ్యె బృందిష్టమై! 707

పదియార్వేలుగ యేలుకోటియు నిజస్వాభావికాపూర్తి చే
సదమున్ రుచ్యము, వర్ణనాత్మకము, వీక్ష్యాలేఖ్యమున్ జేసి స
మ్మద సంధాయకులైన హేతువున, నామొత్తమ్ము - కేళాకుళిన్
గదియన్ - గట్టు నదల్చుచుండిన బృహత్కాంతారమై యొప్పెడిన్ 708

సభ నుద్దేశించి నొడివె
ప్రభువా జానకి గుఱించి; పరమేశు ధనుః
ప్రభగూరిచి, వారును వీ
రు భంగ పడిన తెఱగున్ గుఱుతు జేసె నెతిన్ 709

మోదవిధేయుడై నిలిచి ముఖ్యముగా ననె మైథిలుండు, దా
నాదిని బూనినట్టి క్రతు వత్తతి గౌశికురాక గోరుటల్
సాదరమొప్ప వారును హసన్ముఖులై చనుదెంచుటల్, సమీ
క్షాదులు నిర్వహించుట, ప్రజావళి మెచ్చుట, హర్షమిచ్చుటల్! 710

ఆపయి జనకుడు సభకున్
దాపరిచయము నొనరించె దశరథ సుతులన్
జూపరుల కనులకలికము
జూపుల దడవుచు, నుదువుల శోభిలు ననలై! 711

ధనువున్ బాణము భంగిని
మనమున్ బుద్ధియు పగిది, నమస్సున కై జం
టన దనరు ద్వయము; పల్లవి
యనుపల్లవిగ నొకపాట కనుగమ మనగన్ 712

శివధనువును గను కతమున
గవ దోడ్కొని వచ్చెను కుశికతనుజు డిటకున్
సువిదితమె గద జరిగిన
వ్యవహారము; ముందటి కథ పరగును శుభమై! 713

అని జనకుందు గాధిజుని యానతిగైకొని, యానతిచ్చె నా
ధనువును దెండటంచును బ్రధాన భటావళి కాపయిన్ శరా
సనమది వచ్చె - మందస నిషణ్ణము, రాజిత భూరిభార మా
మినుసిగవేల్పు టెత్తళియు, మిక్కిలి వ్రేగగు న్యాసరాసియున్! 714

గాధేయున్ గనుసన్న గైకొని శిరఃకంపంబు జేసెన్ విదే
హాధీశుం డొకసారి కాంచె సభ, బ్రహ్మర్షి వ్యక్త సందర్భపుం
బ్రాధాన్యమ్ము వచించె, నంత ముని - నేత్రస్పృష్ట సంభావ్య సం
జ్ఞా ధిష్ణ్యమ్మును జూపె, జూపె నవలక్ష్యంబున్, మహాదాక్ష్యమున్ 715

"అన్యులవల్లగాని యొక యజ్ఞముగా నిది నిల్చిపోయె, మా
ధన్యత మీఱ నొక్క ఘను తాలిమి, మేలిమి, ఠీవి, లావు, రా
జన్య మహావరండకము సమ్ముఖమందున గడ్డకెక్కు, స
మ్మాన్యత జెందు, జెందు బలు మన్నన లాపయి మానవళికిన్" 716

ఈరీతి ననియె ముని తా
'నో రామ! ధనువును జూడు మోయీ, కాని
మ్మా - రుద్ర ధనువు నీకై
శ్రీరాగము నించుచుండె, స్పృశియించు మికన్' 717

జనము మంచుదుప్పటి దాల్చు మినుప చేను
చందమై పోయి రంతలో చలిపగతుడు
తఱియ, చాయ వెలుకబాఱు తెఱగుదోచ
వెట్ట నొకరి కొకరుగ నావేగులైరి. 718

ఉత్సాహ :
ఒక సమీర డింభమెలిమి నుల్లసిల్ల జేసెనాన్
బ్రకటిత శుభలక్ష్య పరిధి పర్వి తేలువాఱగన్
సకల వినయ శీలి రామచంద్రమూర్తి లేచె, నా
త్మిక జనన విభేద మైత్రి - తీవెగ బొదిలె సభకున్ 719

ఒక మెఱపు దీవె గాంచినట్లులికి పడిరి,
పిందె పూతల నిండారి పెరిగినట్టి
గున్న మావిని గనినట్లు కొలకులంద
గించె, నానంద బాష్పమ్ము గీలు కతన! 720

శిఖరిశిఖారగ్రతల విలసిత పతాక
దఱిసి నట్లయ్యె, నుదయ సప్తాశ్వు జూచు
చున్న భావనల్ వర్తిల్లె జూపరులకు
దాశరథి చుట్టు తిరిగె ప్రత్యయములగుచు! 721

స్మేరముఖుడగు గాధేయ పారికాంక్షి
ముందు నయనాభిరాముని మూర్తి తనరె,
రామ కార్యార్థి ముని విచారణము నందు-
మురుయు కోదండరాముని మూర్తి కదలె! 722

సోదరు మనోహర హరి ప్రస్ఫుటము రూప
మరసి గర్వాన 'మా అన్న' యనుచు కనులు
విచ్చుకొనె, వెడదయురము వెణద జేసి
కొనె- సుమిత్ర పెద్ద కొడుకు; కుతుకమెసగ! 723

శబ్ద వర్ణిక, జీవ సంసక్తరేఖ
లోయెడదల గుంచెవిదిర్చ - తోయజాక్షు
తేజము మఱి యోజనము జిత్రించి కొనిరి
మునులు, నాచార్యులును, రాజు, ముదితలెల్ల! 724

నిలిచి నినుపారి నింపాది వెలుగు వర్తి
పగిది ధీరగంభీర రూపమ్ము వెలయ,
పసదనమ్ము పసగి చెలువమ్ము లెసగ
రాముడెసగెను నీకాశ రాశియనగ 725

రామాఖ్యుందు సదస్సుజూచె జనతాప్రహ్లాద కాదంబినీ
దామాలంకరణ ప్రకృష్టము, శిరస్త్రాణ క్రమాముక్త మా
లామాంజిష్ఠము, శ్యామవర్ణ రుచిరోల్లాసప్రభా ధామమ్ము,
క్షేమస్థైర్య జయాభినందన కృతాశీఃప్రోక్షితారామమున్. 726

సంభ్రమ భ్రమర వశస్ఫీత రాగమ్ము
శీర్షకంపమ్ములన్ జెంగలించ
మోద ప్రమోద సమ్ముద పులకిత వద
నములుపకృత సదనములు గాగ

ప్రఫ్లున్న ప్రహ్లాద ప్రహృష్ట నయనమ్ము
ఉత్ఫుల్ల కమలాల యూహనించ
భావాన్వయోచిత వాగ్యోగ భాష్యమ్ము
రదనచ్ఛదము పైనె రంగరించ
ధర్మమున గడు బెద్దల, ధర్మవర్త
నమ్ము నిత్య శీలమగు జనమ్ము జూచి,
జూచె గ్రీగంట - క్రీగంట జూచుచున్న
యంతిపురపుటింతులను పూబంతి నొకతె! 727

ద్యుమణి యిచ్చట, అచట చందురుడు నిలువ,
నుభయ సంధ్య లొక్కటగుచు నొత్తరించె,
స్వరమేళనము గలిసి ప్రసరమయ్యె
రమ్య ముద్యత్కుతూహల రాగ మొకటి! 728

ఒకట నుత్కంఠ యుద్వేగ మొకట, యొకట
శుభశుభాకాంక్ష, విశ్వాస సూచికొకట,
సంబరంబొక వైపు, నుత్సాహ సమయ
మొక్కదరి వెలయ - జెలగె నుత్సవమ్ము! 729

**'రసపదము కదలె– కదలె రామపదము'**

శుభముహూర్త మిదియె, కార్యశుభము కలుగ
వలయు నన్న శుభాశంస వడిని సాగ
సకల జనముల పెరిమకాస్పదము నైన
రసపదము కదలె, కదలె రామపదము! 730

ఆకృతి దాల్చె హల్లులకు నచ్చులు దోడయి సాగిసాగి భా
వైక మహార్థ కావ్యరసవైభవ శీతక మంతరంగమున్
దాకిన రీతి - నొక్క మధుధారయు, ధర్మ్యము, ప్రేమభావనా
స్తోక మనోహరాయతియు శోభిలె రాము హసన్ముఖంబుపై 731

స్మరహరు ధనువును జేరిన
స్మరహరువు నెఱయు రఘువరు సరణికి - 'జననాం
తర సౌహృద' మిదియని, పుర
హరు దరుదగు ఘటనకు దరహాసము జేసెన్! 732

ధనువున్ దాసిన రామచంద్రుడు సముద్యత్కాంతిమై నిండ, నిం
డిన గాంభీర్యము కన్నులందు మొనకట్టీడాడ, నీడాడి రే
గిన నీలాలకశోభ మోము పయి నిక్కెన్ నిగ్గు, తోచెన్ - ఘనా
ఘన సౌందర్య మనోజ్ఞతన్ సమధిక క్షాంతుండు కాంతుండుగన్! 733

ఒక యావేశము గుండెలో ప్రబల నాయోగాధృతా యోగ సా
ధక సంప్రశ్నము స్వీయమై వరల, శ్రీదక్షాధ్వరధ్వంసియా
త్మిక వైవశ్యము భావమై కెరల, గ్రాంతింద్రోచె శ్రీరాముడా
సకల ప్రాంగణ మొక్క సౌఖ్య సరసీ సాదృశ్యమై, తోచగన్ 734

సహజ సమాహృత శక్తులు
ప్రహస్త గతమై హితమిదు ప్రారంభదశన్
మహిత మనోహర పుష్టిని
బ్రహితుడు దాకెను ధనువును భక్తి నియుక్తిన్! 735

తన భాగ్యంబిదియన్న రీతి ధనువే ధన్యత్వ రాగంబులన్
వినిపించెన్ సభ కా రఘూద్వహు గరస్వీకార భాగ్యాప్త సం
వననాదర్శిత శస్త హేతుకమునన్; బ్రఖ్యాతమౌ నుత్సవ
ధ్వన మోదావహాశోభ హెచ్చె - జన భాగ్యంబన్న వేరుండునే? 736

ఎత్తుగ నెత్తె దాశరథి ఈశుని చాపము స్వర్ణకారుడా
యత్త విధేయతా గరిమ హాటక ముంచిన తూనికన్ - లలిన్
యెత్తిన భంగి, నత్తఱి మునీశ్వరు లెల్లరు స్వస్తివాచ్యముల్
హత్తిరి, ప్రేమ పూర్వక శుభాశిషధారలు చూరలీయగన్ 737

బాలుండొక్కడు క్రీడా
లీల న్నాక్షీబశాఖ లివ జూపన్ డా
కేలంగొను గతి నెత్తెను
ఫాలాక్షుని చాపము - రఘువరుడు వరుండై! 738

ఓలము నెత్తి విల్లు నొగి నూన్చెను నిల్చున నేలపై, క్రమో
న్మీలిత కాంతి పుంజమది మించె సభాస్థలి నేత్ర పర్వమై,
కాలనిరూఢి రాజిలె, వికాసము ముందుకు ద్రోవలిచ్చె, బ్రే
మాలయమయ్యె బ్రాంగణ హృదంతరమన్నది - రాము సన్నిధిన్ 739

ఘనతర పౌంస్య శౌర్యము లెకాయెకి రాఘవు ముష్టిబంధమై
తనరగ వింటిరాసి ఘనతన్ మదిబట్టుచు లస్తకమ్ము న
య్యనఘుడు రామమూర్తి కయినందుట తోడనె; ఈ కెలంకునన్
ముని, మిథిలాధిపుండు, జనమున్ - దడవాడుచు విస్మితి జిక్కగన్ 740

ముందు మౌర్వి చిక్కును దీసి ముచ్చటించి
పంచకృత్యధుర్య దలపు నించి, పిదప
శిరసు వంచి, నతులనిచ్చు శిల్ప మిచ్చి
కాలు నాలీఢ భంగిమ కందువ నిడి... 741

## ధనుర్భంగము - ధన్యత్వరాగ ప్రసారము

లాఘవముప్పతిల్ల - తన లావును, లేవయు, దర్శనీయ ధై
ర్యౌఘకృతుల్ విశేషపురుషోత్తము స్ఫూర్తిని జేరదీయగన్
రాఘవు డల్లియన్ బిగియ రాచుచు లాగ - మహాద్భుతంబుగా
నా ఘటనా ప్రసాద ఫలమందె ఘణంఘణ ఘోషణాధ్వనిన్! 742

ఒక టంకారము నిచ్చెనో ధనువు, నభ్యుత్థానమేపారగా
నొక ఝుంకారము విచ్చెనో యనగ దానోలాడె భూరి ధ్వనిన్
బ్రకటాటోపము దీఱెనన్న గతి సారగ్రీవు చాపమ్మునున్
వికలంబై యిలగూలె యష్టి; యిటు మౌర్వీభాగమున్ వ్రేలగన్! 743

సకలాభీష్టము తొంగలించి దరహాస ప్రీతి రాణించె, స్ఫా
టిక సౌధాంగణ మెల్ల; యెల్ల సభ నట్టిట్టయ్యె హర్షమ్మునన్,
బ్రకటోద్వేగము మీఱ నీశ్వర ధనుర్భంగోద్గతా హేతినిన్
మకరాగారములేమి - దిక్కులును, గిరుల్ మార్మ్రోగె హోయంచునున్ 744

ఈశు ధనుర్భంగము - త్రిది
వేశులు, లోకేశులు, రవి, విధులెల్లరు, భూ
తేశులు, నీశులు, మఱి గ్రహ
రాశులు - సేసల, బ్రహర్షరాశుల నీయన్ 745

జయ జయ యని సామాన్యులు,
జయోస్తనుచు మాన్యులు, మఱి జయతి జయతి-యో
జ యతి సమూహము పలుక, 'వి
జయోస్తు - కళ్యాణమస్తు' జదివెన్ విభుడున్! 746

ఉన్నటులుండి యింత సడి నొక్కతె ఐదువరాలు మధ్యలో
నున్న రఘూత్తమున్ దరిసి "ఔగదె యెంతటి యందగాడు! మా
చిన్నది ఆ విదేహసుత సీతకు చక్కని జంట వీవు, మా
కన్నులు పండె తండ్రి, నినుగన్నది కానుపు కాదె తల్లికిన్"! 747

అని వేభంగుల జేతులూచి కని యాపాద శీర్షంబునున్
తెనుగుం బల్కుల స్వాదనమ్ము నిడు మాతృత్వార్ద్రహార్దంబు పై
కొన మూర్ధమ్మున ముద్దు గొంచు నునుచెక్కుల్ పుణ్కి గొండాడుచున్,
జన విభ్రాంతిని గల్లజేసి మరలెన్ - సౌమిత్రి లో పొంగగన్! 748

ఆ వెంటన్ ముదివగ్గులున్, ముదిత లాహాహా యటంచేగి దీ
ప్రావేశార్భటి బెన్ దుఫానువలె వాక్యాటోప సత్కారముల్
దైవాఱన్ మునుముందుకున్ వెడలు నంతన్, మిన్ను ముట్టెన్ - విదే
హా వాల్లభ్య నినాద నాదముల వ్యూహామోద సౌహార్దముల్! 749

ఇంతలు కన్నులుంచుకొని యీ విధి జూచుచు నుత్సహించి య
త్యంత సుఖాంతరస్థితిమహాంబుధి మున్గుచు దేలుచున్న జ
న్మాంతర మెంచి తత్ప్రయతనాచి, యతంద్రత జూచు రాము నే
త్రాంతర దృష్టి – మెప్పు మెయినంటిన తోడనె వింత నిండగన్! 750

స్వపరాయత్తములైన సభ్యజన దృగ్జాలమ్ము నల్దిక్కులన్
విపుల వ్యాప్తిని జెందిజెంది, తృటిలో పీతాంబరుండైన వి
శ్వ పరిత్రాణుని దేహమంతయును పై పై దాకి లోజూపులం
దపకర్ష స్పృహ జిక్కి, జిక్కని సమాహారమ్మునై మీఱగన్! 751

రాఘవుని రూప లవణ్య రామణీయ
కత, సదాదర్శనాపేక్ష కట్టి వైచె,
భావ సంభేద సంభార భారమేర్చి
ప్రాంజలి ప్రహ్వులైరి సభాజనమ్ము! 752

నూవు గింజల నిండిన నూనెవోలె
పత్తి పూవుల దాగిన వత్తి పగిది
మోహనత్వమ్ము నందు సమ్మోహనత్వ
మొలికి చేతికి వాయికి మూతలిడెను; 753

ఇటుల నిశ్శబ్దము జగము నేమఱించ
బోవు నంత, హఠాత్తుగ బొత్తు తగుల
నీక కాలరేఖ తనయునికిని రక్ష
జేసికొనె; సభ మేల్కాంచె; సివమునెత్తె! 754

ధనువు నెక్కు పెట్టుమనిన ధనువు విఱచి
నట్టి వరవరు శ్యామాంగు నరసి కుశిక
తనయుడు తలచె తనలోన తాను; "రఘుకు
లంబు యశము ప్రశస్తి లోకంబు లెఱుగు!" 755

మత్తకోకిల
సత్యవంతుడు వీర్యవంతుడు సాధ్యయత్నము గూర్చె నీ
కృత్యమంగళ ప్రాప్తి కర్తుడు క్ష్మాసుతాదృతి హేతికిన్
నిత్య శోభన లక్ష్మి కూర్మికి, నెమ్మికిన్ దగు చుట్ట మౌ,
ప్రత్యయమ్మెనయన్ సుపర్వ సుపర్వ మయ్యె ప్రపూర్ణమై 756

అని గాధేయుడు లోక రంజన శుభవ్యాసంగ మోదోత్సవ
మ్మును లోబాసలు పొంగువార, హాసనమ్ముల్ మాత్రమే మోముకున్
జనునట్లా రఘురాము శక్తి ఘనహస్తాభాసకున్ భేషు భే
షనుచున్ వీరల వారలన్ తనియ జేయన్సాగె సౌమ్యస్థితిన్! 757

దాంతుడా శతానందు డుదాత్త తార్ద్ర
తోపచిత సాత్త్విక భావముఅకుచుండ
మది దలచె నౌచితి మీఱ మహిత ఫలము
'భావి యుగధర్మ మిదియెయై వరలుగాత!' 758

పూనకము నందొక సరణి పుంజికొన్న
విధము సభ యూగి యూగుచు విక్రమించ,
నట పురమ్ము లంతిపురము లలసిపోయె –
నోపజాలని సంబర మొదవి యెదల! 759

తలపుచూలి తా విసరిన వలపు వలువ
రాఘవు దడవి, సమగతి రథము నెక్కి,
పుడమి కొమరిత గప్పుచు బొత్తుగలిపె –
నెదియొ అనుశాసనపు బల్మి యేలినట్లు! 760

### శుభముహూర్త సమీక్ష – వివాహ సన్నాహం

ఆజ్ఞా నిర్వాహకులన్
విజ్ఞాపన పత్రమిచ్చి వేవే బంపెన్
బ్రాజ్ఞుడు జనకు డయోధ్యకు
ప్రజ్ఞానవిదుడు దశరథ ప్రభు సన్నిధికిన్! 761

హితవరి విశ్వామిత్రుడు
కృతహస్తుడు రామచంద్ర దృష్టవు మఱియున్
కృతలక్షణుడా లక్ష్మణ
ధృతిమతి కలరు మిథిలా పురి ననెడు వార్తన్! 762

నీ పుత్రకుడౌ రఘుపతి
నా పుత్రిక వీర్యశుల్క - నయముగ గెలిచెన్,
భూపుత్రీ దశరథ తన
యోపయమమ్ము జరుపవలయుననెడు కోర్కెన్! 763

కుశల ప్రశ్నల కెల్ల ద
న శిరః కంపము ననుమననముగా జేసెన్
దశరథ భూమీకాంతుడు
ప్రశస్త వృత్తాంతమనుచు బ్రహ్లాదముగన్! 764

ఒక యాచారము లక్షణమ్ముగ మహాయోగ్యంబుగా నిల్చునం
చొక కల్యాణము గడ్డకెక్కు బ్రణయాయోగంబు గానంచు నా
త్మిక భావోదయ సంభ్రమమ్ము నెఱయన్, దెప్పిర్లి, సాకేత పా
లకుడా వెంటనె మంత్రులన్, సకలురన్ రావించి గోష్ఠీక్రియన్ 765

వచ్చిన వార్త జెప్పి తనవారల హార్దము గొంచు, వార్తనున్
దెచ్చిన వారి కెల్లను బ్రదేయము లిచ్చి, ప్రమోద సాంద్రుడై,
చెచ్చెర వత్తు మంచు ననిచెన్ మిథిలాగత మాన్యముఖ్యులన్,
విచ్చిన పూలతోట ప్రభవించె నయోధ్యగ, నేటి వార్తగన్ 766

ముందు సాగె వసిష్ఠుడు మునులగూడి;
వామదేవుడు, జాబాలి ప్రభృతి ఋషులు
వారు కాశ్యపు వెన్క; జైవాతృకుడగు
నా మృకండాత్మజు దెస కాత్యాయనుండు! 767

కదల, గదలె మహారాజు; కదల సాగె
రాణివాస మా మానినీ ప్రకరము మెయి
గలరు - ముఖ్య గణాధ్యక్ష గణము; వారి
సరస నధికార నివహమ్ము సాగిపోయె! 768

విచ్చిన పూవుదోట కనువిందుగ సాగుచు, కమ్మగాడ్పుగా
వచ్చుచు, పారవశ్య సుఖభావననిచ్చుచు; పారువాదళం
బిచ్చిన హస్త పృక్తి గరమిచ్చుచు నున్నది యన్న దృశ్యమే -
యచ్చుల గూర్చి హత్తె హృదయంబు పయిన్ గదువేడ్క జేయుచున్! 769

తత సంభారము సాగి సాగి మిథిలాధానిన్ బ్రవేశింప, స్వా
గత సంరంభము పొంగి పొంగి ఘనమార్గంబందగా, ధాత్రి బ్రా
కృతికాటోపము హెచ్చిహెచ్చి దివి దాకెన్ ధాటితో, నెల్లెడన్
సతతోల్లాసశుభావధాత సుషమా సంశ్లేషమే తోచెడిన్ 770

ద్రుతవిలంబితము

1. తన మనంబున దందడి జేయు యో
   చన వచించె బ్రజాపతి మైథిలుం
   డు, నయ హర్షకుడున్ మహనీయుడౌ
   తనదు వియ్యము, దాపసులౌ నన్ 771

2. జనక జాత్మజ జంట రఘూద్వహుం,
   డనఘు లక్ష్మణు హస్తము సూర్మిళా
   వనిత గైకొను, వాశిత మాండవిన్
   గొనును కైకకు గూరిమి పట్టియున్... 772

3. చెలువ మాగధి చిన్న కొమారుకున్
   జలజనేత్రి కుశధ్వజు పుత్రియున్
   వలయు బ్రేముడి బాణిగృహీతగాన్
   నలువు పొల్పగు నాలుగు జంటలన్! 773

4. ఘనులు మార్వలుకంగల దేమియున్
గనరు – జైయను కంఠనినాదముల్
ఘనపథంబును గ్రందుకొనెన్ వడిన్
దినకరాన్వయ ధీధితి శోభిలన్ 774

## 'కల్యాణము చూతము రారండీ!'

సమ్మదహేళి దేల్చుచు బ్రజన్, బ్రకృతిన్ మనసించి పచ్చనౌ
సొమ్ములు కూర్చి, కూర్చు ఋతుశోభ వెల్లార్చి వనాలకున్, మనో
జ్ఞమ్మగు రాగమేర్చి విహగమ్ముల కెల్లను, పెండ్లికూతురై
యిమ్మహి జేరె జైత్రము, మహేంద్రు భవిష్య సుచిత్ర మౌవిధిన్! 775

కొల్వు వీడ్కొలుపుచు కొదరు కోర్కెల తాల్మి
తలదాల్చి కదలె నేత జనకుండు
'కల్యాణమస్తు' ను కామనా వృత్తియె
రసన దల్చి కదలె ప్రముఖ మౌని
లోక కల్యాణ మాలోక హితమ్ముగ
కనుల నించి కదలె గాధిపట్టి
అతిప్రమితీమతి యన్న యను పెరిమె
కరమూన్చి కదలె లక్ష్మణుడు ఘనుడు

వీర్యశుల్కా దా గొనుచుండె వీర్య ఘృష్టి
చిత్ర మొనగూడుచుండె నౌచితికి జిక్కి
యనెడు భావన నెదనింపి యడుగు బయట
నిడిరి–మాన్యులు సామాన్యు లడరు తృప్తి! 776

నుతిపిడి ముగియించి నునుపు జేసిన పొలా
లునికి గోల్పోవగా నొడియదొడగె
తెరువరి యడుగుల తెఱపి దూకొన్న రా
దారులే చూపఱు తావులయ్యె
విఱుగ గాచిన పండ్ల విరిదట్టు జేసినన్
తరువులే అరుసపు బరువులయ్యె
విరియ బూచిన పూలతరువులు సేసలు
పెట్టినయట్టిరై వేసరించె

చక్రవాళపు లోయల సంతరించి
సంకలితమైన నందన ఛ్ఛాయ దాల్చె
జనమసంఖ్యాకమై సదస్యాఖ్య దనర
నవనిజా రఘురామ కల్యాణవేళ! 777

అఖిల దిక్కుల కాంతి యనువగు తావుగ
కల్యాణ వేదిక కదలి వచ్చె
పుడమికి బారాణి బూయగా నింగియే
తగటు జీరల దాల్చి తరలివచ్చె
నందనందనము తనకు దోహద మిచట
గలదని మైవడి గదియ వచ్చె
కుల పర్వతము లెల్ల కులసంభవుల మైత్రి
కుద్ధర్షమును గూర్చ నొలసి వచ్చె

స్థానముల మార్పు శూన్యము సంతరించు
ముప్పు దప్పించ దివిజులే ముందు దిగిరి –
జానకీరామ మిథునంపు శస్త మంగ
ళోత్సవమ్మరయు నదృష్ట మురవడింప! 778

'ఇదె–సీత; నాదుసుత; నీ
కు దగున్, ధర్మాచరణముకున్ సహచరియై
యొదవున్; పాణి గ్రహణము
సదాతన స్ఫూర్తి నిండ సన్మతి గొనుమీ! 779

'చేరదీయు మీమె జేకూరు శుభములు;
గరము కరము జేర గలుగు భద్ర
శతము; మీకు మీరె సరిగ, సాగించుడీ
జీవన మనురాగ భావనమ్ము'! 780

వరు హస్తంబున సీతా
వరవర్ణిని హస్త మునిచి, ప్రాప్యాకాంక్షన్
స్వరసహిత వేదవిధి భా
స్వర కన్యాదాన మనెను జనక ప్రభువున్! 781

లీలా మానుష మూర్తియె
శ్రీలావణ్య గుణ వితతి జేరగ నది వి
శ్వా లోకాలేఖ్యంబుగ
త్రైలోక్య శ్రేయము నిడె, ధర్మ స్థితికిన్! 782

ఈమె, నా, నీ-యనెడు సర్వనామములవి
సీతకును, జనకునికిని, శ్రీరఘువరు
నకును మాత్రమే వర్తించు నడత కాదు
తత్త్రయము సూక్ష్మమది ప్రబోధనము, ధరణి! 783

జీవధానిలోని జీవధారుల కెల్ల
నన్వయించదగు త్రయమ్ము సుమ్ము -
వరఫణితినసె - 'ఇల పావులూరి' - బుధుడు
కావ్యభావ మిడెను, ఖ్యాతి గొనెను! 784

తమము నిండిన తాటక దండనమ్ము,
నా రజోలీనయౌ యహల్యాను మతియు
గడచి, సత్యసందీప్త సాకల్యయైన
జానకీ సమధిగమమె సత్త్వసిద్ధి! 785

శీలము లీనంబయ్యెను
తూలాడని శక్తిలోన, తులకించు తలం
బ్రాలన్ సౌందర్య ద్వయ
మేలెను, రూపైక దీప్తి యేలె జగంబున్! 786

విశ్వ గృహమ్మున వెలిగెన్
విశ్వసుతా దీపకళిక పెండిలి సేతన్
విశ్వజనీన విశేషము
విశ్వామిత్ర దివిజవర విష్కంభముగన్ 787

కార్య దర్శనమ్ము, కార్యవిచారమ్ము,
కార్య నిర్వహణము, కార్య దీక్ష,
కార్య సంశ్రయమ్ము, కర్తవ్య కర్మమ్ము
లన్ని యొనరినపుడె - అసలు ఫలము! 788

కల్యాణ మంత్రముల సా
కల్యము జగములకె శుభము గాగ, నచట కౌ
సల్యా సుతు భద్రము - వై
కల్యముగ నొలసె నొకరికి కాలము కతనన్ 789

ఇచట ప్రత్యక్ష విస్తరమిట్లు సాగె;
హృద్య నేపథ్య సంగీత మిన్ని యెదల
బలికి పలికి యాగుబ్బున భార్గవు వెలి
లోపల దవిలె; భ్రుకుటి గల్లోల బఱచె! 790

ఒక మహాగాథలో నుండు నొకటి రెండు
మే లుపాఖ్యానములు, వాని మూలకథలు
వరలు ననుసరణీయమౌ వర్తనమ్ము
దెలుప; సతము నిలిచి వెల్గు దివ్వెలవియె!! 791

సీత కటాక్ష పంక్తి లిపి జేగొని నాథుడు జేసె ప్రేమ సం
భూత మహాప్రబంధము; ప్రపూత లిఖించిన మౌన భాషకున్-
జేతను, జేతినిన్ గలిపె శ్రీరఘురాముడు విశ్వమేలగన్,
భాతిగ సాగురాగముగ భాసిలె నా యనురాగ సారముల్! 792

మహాస్రగ్ధర
కలితానంద ప్రదాతా! కలికి వసుమతీ కన్యకా హృద్విజేతా!
లలనా లావణ్య జిష్ణూ! లలిత గుణగణాలంకృత క్షేత్ర విష్ణూ!
విలసత్కాల్యణమూర్తీ! విషమశరతరస్వీ జితాకార కీర్తీ!
జలదశ్యామాంగవేశా! సతత నిజ ఋతాచార సంవ్యాపితేశా!

శ్రీ శ్రీ శ్రీ

# జే.యస్.మూర్తి (విహారి)

జననం: 15-10-1941, విద్యార్హతలు : ఎం.ఏ., ఇన్సూరెన్స్‌లో ఫెలోషిప్, హ్యూమన్ రిసోర్సెస్ మేనేజ్‌మెంట్, జర్నలిజం వంటి ఇతర అంశాలలో డిప్లొమాలు, సర్టిఫికెట్స్, ప్రచురిత వ్యాసాలు.

- తెలుగులోని అన్ని ప్రసిద్ధ పత్రికల్లోను అసంఖ్యాకంగా కథలు, నవలలు, సాహిత్య వ్యాసాలు, గ్రంథ సమీక్షలు, నాటికలు, కవితలు ప్రచురింపబడినవి. వివిధ అంశాలపై ఆకాశవాణిలో, దూరదర్శన్‌లో ప్రసంగించడం జరిగింది. వక్త, కార్యకర్త.
- 10 కథాసంకలనాలు, 5 నవలలు, ఒక విమర్శనాత్మక వ్యాససంపుటి, ఒక సాహిత్య కదంబం, 4 కవితా సంపుటాలు- పుస్తకరూపంలో వచ్చాయి. ప్రముఖ రచయితల, విమర్శకుల ప్రశంసల్ని పొందాయి.
- 'పళ్ళచక్రం' కథా సంపుటికి శాలివాహనతో జంటగా-ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత. ఆంధ్రసచిత్ర వారపత్రికలో 5 సార్లు బహుమతి పొందడం విశేషం. అనేక ఇతర బహుమతులూ పొందారు.
- 26 ఏళ్ళనుంచీ గడియారం వేంకట శేషశాస్త్రి అవార్డ్ నిస్తున్న సంస్థ - కడప రచన సాహిత్య వేదిక అధ్యక్షుడు.
- విహారి రచనలపై పిహెచ్.డి.కి పరిశోధన జరిగింది (ఉస్మానియా).
- శ్రీ పదచిత్ర రామాయణం ఛందస్సుందర పద్యకావ్యంగా ఆరు కాండలూ వ్రాశారు. ప్రముఖ కవి, పండిత ప్రశంసల్ని పొందారు.
- ప్రస్తుతం 'వార్త' , 'ఆంధ్రప్రభ' రెండు పత్రికల్లోనూ 'కథావిహారం', 'తెలుగుకథ తేజో రేఖలు' శీర్షికలు నిర్వహిస్తున్నారు. విస్తృతంగా కథలు, సాహిత్య వ్యాసాలు రాస్తున్నారు.



# విహారి కథానికలపై కొందరు ప్రముఖుల, పఠితల అభిప్రాయాలు, వ్యాఖ్యలు

'వాక్యం రచయిత తయారు చేసినట్టుండకూడదు. జనుల అనుదిన వ్యవహార శైలి నుంచే ఊడిపడినట్టుండాలి. కథ కల్పించి చెప్పినట్టుండ కూడదు. సమాజ జీవన పటం నుంచే శిల్ప సమన్వితంగా కత్తిరించిన మచ్చుతునకలా వుండాలి. సందేశం వాచ్యంగా వుండకూడదు. వంగ్యవైభవంతో గుండెల్లో ధ్వనించాలి. ముచ్చటైన యీ మూడు లక్షణాలకూ విహారి కథలను వినూత్న ఉదాహరణలుగా పేర్కొనవచ్చు'

**-మధురాంతకం రాజారాం**

"విహారిని ఈనాడు ఎవరూ భుజం తట్టనక్కరలేదు కూడా. ఆయన కవి, కథకుడు, నవలా రచయిత, నాటక ప్రయోక్త, వ్యాసకర్త. పాఠకులకు సుపరిచితుడు. ఆయనలోని కవి విజృంభించినప్పుడు కథలో ఆత్మాశ్రయ రీతిలో జోక్యం కలుగచేసుకోనప్పుడు-'నిప్పు' వంటి జీవిత వాస్తవ కథలు వెలువడి మనల్ని ప్రశ్నిస్తున్నాయి; వెంటాడుతున్నాయి. మన జీవితాల్ని సరిచేసుకోవలసిన అవసరాన్ని అనుభూతం చేస్తున్నాయి."

**-డా॥ కేతు విశ్వనాథరెడ్డి**

" విహారి కథలన్నిటిలోనూ ఆత్మపరిశీలన, ఆత్మసంస్కారం- వాస్తవికతా దృష్టికి వన్నెతెచ్చి మట్టిని బంగారం చేస్తోంది. విహారి ఆశావాది. జీవితంపట్ల, తోటి మానవునిపట్ల ఆయనకు గల విశ్వాసం గొప్పది"

**-ఆర్.యస్.సుదర్శనం**

"విహారి మనకున్న కొద్దిమంది మంచి కథా రచయితలలో 'ఎన్నదగిన రచయిత'- అనేవి యీయన వెనకాతల మిత్రులు అనుకొనే మాటలు"

**-వీరాజీ**

"విహారి కథలలో ఒక ఆర్ద్రభావమూ, మానవ సంబంధాలలో ఉండవలసిన నాజూకు తనమూ, సృజన సుకుమారత-ఆహ్లాదం కలిగిస్తున్నాయి'

**-మంజుశ్రీ**

"ఇవీ మా తెలుగు కథలు అని గర్వంగా చెప్పుకొనేంతటి మాస్టర్ పీసెస్-స్పృహ, చలనం కథలు. ఎత్తుపల్లాలు, చలనం, నిప్పు-వంటివి ఎప్పుడోగాని రానివి. గాలివానలాగా ప్రపంచ కథానికల్లో చోటుచేసుకోగల సత్తావున్న కథ- 'నిప్పు'.

**-పి.యస్.యస్.శాస్త్రి**

'నిప్పు కథానిక అత్యద్భుతం. మీ ప్రచండమైన శైలీ వేగానికీ, కవితా భావాలకూ వస్తువిలక్షణతకీ, శిల్ప శిఖరాలకూ అభినందనం. ఈ కథ చాలు. విమర్శకాగ్రేసర చక్రవర్తులు మీ స్థానాన్ని కాళీపట్నం పక్కనో, రాచకొండ పక్కనో, బీనాదేవి పక్కనో, కూర్చోబెట్టటానికి."

**-కె.విజయప్రసాద్**

"కథా శిల్పం వుణికి పుచ్చుకున్న విహారిలాంటి వాళ్ళకి ఏది రాయాలన్న సమస్య రాదు. ఏది రాయకూడదనేదే అప్పుడప్పుడూ సమస్య అవుతుంది"

**-డా॥ పరుచూరి రాజారామ్**

"చలిలో సూర్యుడు కథ ఒక మాస్టర్ పీస్. ఈ కథ ఇతర భారతీయ భాషలన్నిటిలోకి అనువాదం కావాలి"

**-పి.వెంకటేశ్వర్లు**

"గుండెలో కోయిల-అనిర్వచనీయమైన భావానికి అత్యుత్తమ రూపకల్పన. విశ్వనాథ్ వంటి ఉత్తమ దర్శకులు చిత్రీకరించవలసిన ఆణిముత్యం లాంటి కథ ఇది"

**-జి.సి.ప్రసాద్**

"క్షుణ్ణంగా సాహిత్యాన్నీ, జీవితాన్ని చదివిన అనుభవశాలి, మేథావి మీరు. కనుకనే గొప్ప రచయిత, కవి... అయ్యారు. మీ పద్యఃస్ఫూర్తి గొప్పది. నాకు ఒకటే విచారం-మీ కథల్లోని తాత్విక చింతన, శిల్పకల్పనము, శైలీ విశిష్టతల మీద ప్రత్యేక వ్యాసాలు రాలేదే అని. మేము గర్వించే రచయితలు మీరు'.

**-పార్థసారథి**

"అందరూ ఆడిపోసుకొనే మధ్యతరగతి మందహాసాల వెనుక దాగిన సింబల్స్‌ను, ప్రత్యేకతలను ఔపోసన పట్టిన కథకుడు విహారి... (వీరి కథలు) ఆధునిక కల్లోలాల మీద కరదీపికల్లాంటివి. సాధారణ వ్యావహారిక సత్యానికి గూడా సాహిత్యగౌరవం, తాత్త్వికౌన్నత్యం ఇవ్వగలిగిన - కళాత్మక కుంచె - వీరి కలం".

**-మునిపల్లె రాజు**

కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత

"ఈ సంపుటిలోని కథానికలు వన్నెవన్నెల బతుకుతీరుల చిత్రాలు. మనస్సు లోలోపలి కలవరాల, కలతల కసిడికోతల వెతలు... ఇవన్నీ 2007లో రాసిన కథానికలు. మనసు లోలోపలకు జొరబారే కథానికలు".

**-డా॥ పోరంకి దక్షిణామూర్తి**



## శ్రీపదచిత్ర రామాయణము - సుందరకాడము - పద్యకావ్యము
## కవి పండితాభిప్రాయములు

'సుదరకాండలో కథాకథన నైపుణ్యం మూర్తిగారిని కవితాకథన 'విహారి' గా మనకు ప్రత్యక్షం చేస్తుంది. పద్యాల ఛందోరామణీయకం ఈ నైపుణ్యానికి నైగనిగ్యం కూర్చింది."

*-సాహిత్య బ్రహ్మ* ***డా॥ వి.వి.ఎల్. నర్సింహారావు***

"శ్రీ విహారిగారు చేసిన తపస్యకు వరివస్యకు, నిదర్శనం ఈ పదచిత్ర రామాయణం. ఒక సారి పఠిస్తేచాలు మానవ మనో మాలిన్యాలు క్షాళితమైపోతాయి. ఉదాత్తభావాల ఒరవడితో ప్రవృత్తిలో ఒక తేజస్సు కదలాడుతుంది. ప్రాచీనాధునిక - ఆంధ్రసాహిత్యాలు తెలిసి చేసిన రచన ఇది. ఈ పదచిత్ర రామాయణ సుందరకాండ ఆంధ్రసాహిత్య రసికుల అంతరంగాలలో విహరిస్తుందని నా ఆశ."

***ప్రొఫెసర్, డా॥ ఎల్లూరి శివారెడ్డి***

"శ్రీ జొన్నలగడ్డ పద్యపోహళింపు అద్భుతం. ప్రాచీన ప్రబంధ శైలిలో పద్య రచన కొసాగింది. భాషపై ఆయకున్న పట్టు, ఛందోలంకార శబ్ద గాంభీర్యము దానికి తోడై పాఠకుడ్ని మురిపింపజేస్తాయి. పద్య శైలి ప్రాచీన కవుల పోకడలో కొనసాగింది. పద్యం ఎత్తుగడ, విరుపు, కవికున్న భావబంధురతను తెలియజేస్తాయి. పద్యం నడకలో ఒక సొగసు ఉంది. ***డా॥ ఆర్. అనంతపద్మనాభ రావు***

"ముఖ్యఘట్టాలలో - పద గాంభీర్యము, అలంకారాలు, శబ్దార్థ సంపద, ధ్వని, గుణనికురము కావ్యంలో రసపోషణకుపయుక్తమగు పరికరములన్నీ ఫలించి రచనని శోభస్కరం గావించినవి" ***శ్రీ క.ల.నా. కొండలరావు***

విశ్రాంత సంస్కృతాంధ్ర పండితులు

"ఏ పూర్వజన్మ సుకృతమో వెంటవస్తేగాని, కవి కలం రామాయణం మీదికి వెళ్ళదు. మనసు భక్తిభావ రసార్ద్రం కాకపోతే సుందరకాండ రచన హనుమద్భక్తి తత్త్వాన్ని ఆవిష్కరించలేదు. ఈ రెండూ ఒక చోట తారసపడిన యోగమే మూర్తిగారి రచనా సామర్థ్యానికి, కావ్య నిర్మాణ కృతార్థతకు ఆలంబనం"

***శ్రీ పువ్వాడ తిక్కన సోమయాజి***

"కవిత్వంలో పదాలు సందర్భచిత్రణని, సన్నివేశాంతరంగాన్ని కనులకు కట్టిస్తాయి. ఆ పద సంబంధాలు సమాచారం ఎరుక చేసి వెళ్ళిపోవు. మనసులో నిలుస్తాయి. అది కవితా శిల్ప చాతురి. కథలోని కొసమెరుపు"

***శ్రీ అన్నవరం ఆదిశేషయ్య.***

"పుష్పకవిమానం - మణివిహారములైన విహంగ జంతుజాలము, చిత్రభుజంగములు, తురగరూపం, చిత్రచయముతో ఉన్నదట. ఇదేం విశేషమైన వర్ణన? కాదే! అసలంతా కొసరులోనే ఉంది. కొసమెరుపు - 'శ్వాసనూదుట' మాత్రము 'స్రష్టమఱచె' అంటారు. అదీ కవిత్వ స్ఫూర్తి! అలాగే, 'ఆకులేనికాడ పాడవెంతైననేమి? పాలతో తైలమునకేమి ఫలముదక్కు?' వంటి భావనాగరిమ, లోకజ్ఞత వెల్లివిరుస్తుంది"

సువర్ణఘంటాకంకణాలంకృత, అవధానభారతి,
సూర్యసదన ఆస్థానపండితులు, అవధానశేఖర భాషాప్రవీణ
***శ్రీ కట్టమూరి చంద్రశేఖరమ్***

"అర్థగాంభీర్యము, శబ్ద సౌందర్యము, పదసౌష్ఠవము కలిగి ఆధ్యాత్మిక, ధ్యాన, జ్ఞాన, జ్యోతిష్య, యోగశాస్త్రరహస్యముల, మార్గముల నాయాతావుల దర్శింపజేస్తూ - కవి తమ అద్భుత కవితా శైలిని ప్రదర్శించారు. ప్రతిష్ఠకైకాక ప్రపత్తితో చేసిన శ్రీపతి నీరాజనము - శ్రీ పదచిత్ర రామాయణము!"

*విద్వాన్* ***శ్రీ చల్లా లక్ష్మీనారాయణ***

పదచిత్ర బంధురంగా, పరమ సుందరంగా రూపొంది మీకావ్యం అన్వర్థ సంజ్ఞతంగా వెలువడటం విశేషం. ఎన్ని పదాలు! ఎన్నెన్ని పదచిత్రాలు! అడుగడుగునా మీ ప్రత్యేకత గోచరిస్తోంది..... కప్పిరి, మేగలి, గుడిగి, అగవు - ఇటువంటి తెలుగు మాట లోకవంక మురిపిస్తుంటే చోక్షము, తుంతుర్వము, పంకిణి, కటింబకులు వంటి తత్సమ పదాలు పాఠక మహాశయుణ్ణి అలరిస్తాయి మఱొకవైపు..... ఆయా ఘట్టాలలో మీ ప్రతిభ తెక్కలు విప్పింది. మానిన గాయంపు మచ్చపగది; చేతు రఘురాముని చేతము పూచు చూతమున్, (పుష్పకం) గాలిలో దేలు శ్వేతాభ్రఖండమట్లు, ఆకు లేని కాడ పాడవెంతైన నేమి..... ఇటువంటి వాక్యాలనేకం ప్రాజ్ఞజనమనోరంజకాలు కాగలవు.

***శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి***

అనేక తెలుగు పదాలను అలవోకగా సాధికారంగా ప్రయోగించారు. మీ వర్ణనలు, అలంకారములు, నుడికారపు సొబగులు - మీ మేధో జనితాలు. వైవిధ్యంగల ఛందోవృత్తరీతులను, రగడలను ఎన్నింటినో పరిచయం చేశారు. ప్రయోగాత్మక దృశ్య చిత్రణములు ఆకర్షించినవి.

***శ్రీ భట్టారం రాధాకృష్ణయ్య***

ఎన్నోరకాల ఛందస్సులను పద్యాల్లో శిల్పించారు. కవితా మర్మజ్ఞత్వంలో కథకు కొత్త సొబగులందించారు. అదో 'పద్యవ్యూహం' ఛందోశిల్పం...... విహారికి పద్యంలో తనదైన పలుకు, అద్భుత ధారాశుద్ధి, నవభావన, ఆత్మవిశ్వాసం వున్నాయి. పద చిత్రాలలో పదనిసలు అదొక ప్రత్యేక సోదాహరణ వ్యాసమవుతుంది.

***శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్***

(674వ పద్యం) 'వచ్చును / మంచిరోజు......' స్వప్నం కన్నది భూపుత్రి. సీత దేవత . వచ్చిన ఆత్మ బంధువు ఆంజనేయుడు. రాబోతున్నది పురాణ పురుషాకారంలో వున్న విష్ణుమూర్తి రామచంద్రుడు. ఆ కల సత్యం కాకుండా ఎలావుంటుంది. ఇది కవి దర్శనం. అమ్మవారి కలను కవి దర్శించాడు. ఇది క్రాంతదర్శనులు కవులు అనటానికి ఉదాహరణ..... వివిధ ఛందోరూపాలు దర్శనమిస్తాయి. ఇవి కవి ప్రతిభకు నిదర్శనాలు.

*దైవజ్ఞ శిరోమణి, జ్యోతిష, వాస్తు విద్యాప్రవీణ, భాషాప్రవీణ*
***శ్రీ ముళ్లపూడి లీలాకృష్ణమూర్తి.***

మీ మఱియు ఇతరుల అభిప్రాయములందులో లేకున్న ఈ కావ్యము ఒక గొప్ప ప్రాచీన కావ్యముగా తలచదగినంత ఉత్తమముగా ఉన్నది. భాష, భావములు సంస్కారయుతములై ఉన్నవి.

***శ్రీ వాసినీడు సాంబశివరావు***

మీ సుందరకాండము పరమరమణీయము.... పదచిత్రాలలో పల్లవించిన ఆత్మాన్వేషణ చాలా ఉదాత్తంగా వుంది. రామానుగ్రహం లేకుండా ఇలాంటి రచన చేయడం సాధ్యంకాదు

***ప్రొఫెసర్ ముదిగొండ శివప్రసాద్***

వర్ణనల ద్వారా అద్భుతరసం ఉద్భవించింది. ఛందో వైవిధ్యం చాలా ఎక్కువగా వుంది. హనుమ మహేంద్రగిరి విహారం, ఆకాశపరిలంఘనము, మైనాక సమాసక్తి, సురసవిరసము, పుష్పకం, అశోకవనం, రావణ, ఆంజనేయ మూర్తి వర్ణనం ఇలా ఎన్నెన్నో పదచిత్రాలు కవి ప్రతిభావ్యుత్పత్తుల సమాహారంగా దర్శనమిస్తున్నాయి.

**డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు**

సదాశయంతో రసవంతమైన కావ్యాన్ని హృద్యముగా రచించారు. అభినందిస్తున్నాను.

***డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి***

అసలే శ్రీమద్రామాయణము, అందునా సుందరకాండము కావ్యము. అందుకొనుట మహాభాగ్యం. మీ ప్రౌఢకావ్యమును చదివి ఆకళించుకొనటానికి ఎంతో సమర్థత, పాండిత్యము ఉండాలి. అన్నిటా సకలసమర్థులు, యోగ్యులు, సహాయసహకారము లందిచుటలో ముందుండు మా మిత్రులీ కావ్యం వ్రాశారనే తలంపే గర్వకారణం.

***శ్రీ కె. నటరాజారావు.***

పద్యంలో క్రొత్త ఎత్తుగడలు, నడకలు స్ఫురించిన తావులనేకం ఉన్నాయి. కథనం ఎప్పడూ ప్రాణప్రదమే. ఆ గుణం అడుగడుగునా ఉంది. లయాన్వితమైన పద్యం. అందులో సంగీతాన్ని జోడించటం మీ పనితనం..... సీతా సందేశంలో 1046 పద్యం కనులకద్దుకో తగినది..... పద్యంపై మీకింత పట్టు వున్న విషయం ఇప్పడే తెలిసింది. (కథకులుగా మీరు లబ్ధ ప్రతిష్ఠులే) మనసును పవిత్రీకరించే మంచి పుస్తకాన్ని అందించారు.

*శ్రీ రసరాజు*

సార్వకాలీనమూ, సార్వజనీనమూ అయిన ఆదర్శమానవీయ భావాలను పద్యాల్లో పలికించటంలో మీ ఉద్విగ్నత, మత్తు, నిర్ణయం, దీక్ష, ఊపు, పిచ్చి..... మాటలకందనివి. ప్రబంధకవుల సరసన పీటవేసి కూర్చోబెట్టటానికి ఈ గ్రంథంలోని ఏ సీసపద్యాన్ని ఎంపిక చేసినా చాలు.

*శ్రీ తోట చంద్రశేఖరరెడ్డి*

మీరు పుణ్యాత్ములు, ధన్యాత్ములు, మీరొక పవిత్ర కార్యాన్ని నిర్వహిస్తున్నారు. ఇది లోక కళ్యాణ కారకమైంది కూడా. అభినందనలు.

*ఆచార్య పేర్వారం జగన్నాథం*

కథారచయితగా పేరొందిన మీరు చక్కని కథాకథన శిల్పంతో, అద్భుతమైన పద్య శిల్పంతో రామాయణ కావ్యాన్ని రచించటం ప్రశంసనీయం. విలక్షణమైన, విశిష్ట భావస్ఫోరకమైన ఎన్నో కొత్త పదాలు ప్రయోగించారు. అభినందనలు. సుందరకాండను రచించి ధన్యులైనారు.

*ఆచార్య రవ్వాశ్రీహరి*